సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

సంపుటము 45
సంచిక 51
19-8-53

విజయ శ్రావణ శుద్ధ నవమి; బుధవారం



చేవతరగని తాత

ఫొటో : శ్రీ ఏ. సంపత్ కృష్ణ—మద్రాసు.

## విషయానుక్రమణిక


ముఖచిత్రం : ఎమ్. ఆర్. ఎ. ప్రొడక్షన్సు వారి "లేడీ డాక్టర్" లో కృష్ణవేణి.

కాలక్షేపం—శ్రీదాసు వామనరావు 2

1+1=0—శ్రీ ఇచ్ఛాపురపు జగన్నాధరావు 6

మాంజనేయులు ముస్తిక్కం "గోపాలచక్రవర్తి" 10

ముగ్గురు స్త్రీలు—కె. ఎ. అబ్బాస్ 12

కాళరాత్రి—హోవర్డ్ ఇర్వింగ్ యంగ్ 14

ఆహవనృత్యం—శ్రీ నూరంపూడి భాస్కరరావు 20

అవాంతరం—శ్రీ ఓరుమళ్ళ కామేశ్వరరావు 23

విజ్ఞాన వీధులు—"డాక్టర్" 26

ఈర్ష్య—శ్రీ ద్రోణాదుల శ్రీహరిరావు 30

ముచ్చటగా ముగ్గురు—జెరోమ్ కె. జెరోమ్ 31

ఎర్రబుట్ట-శ్రీ రావి కొండలరావు 35

పోలీసుల సోడా—శ్రీ జి. వి. జి. కృష్ణ 36

దీర్ఘాయువు-శ్రీ గోవిందులూరి సాంబశివరావు 38

సినిమా 44

ప్రశ్నలు-సమాధానాలు 48


## పైవారం నుంచి
## సంధి - విగ్రహం



సంధి విగ్రహం (పంచతంత్రం) బొమ్మల సీరియల్ పైవారం (26-8-53) నుండి ప్రచురింపబడుతుంది.

—సంపాదకుడు.




"అకొని యేడ్చు లేజిరుత
 లన్నముకై తన కొంగులాగ, తె
ల్లాకట సోలుచుండెడి నిజాంగన
 దుర్దశ జూడజేని, యా
చ్ఞాకలనా విధంగ భయ
 సంభృత గద్గద శూన్య కంఠుడై
చేకొని దేహియంచడుగ
 జేరుట కాలినపొట్ట కివ్వదున్."

తా॥ ఆకలిచేత ఏడ్చుచున్న చిన్నబిడ్డలు అన్నముకొరకై తన కొంగుపట్టి లాగుతూ ఉండగా, ఆకలి బాధతో సోలిపోవుచున్న తన భార్యయొక్క దుర్దశను కన్నెత్తి చూడకుండా, యాచనకై బయలుదేరి, తన యాచన ఫలించదేమో అనే భయంతో గద్గదస్వరంతో, జీవంలేని కంఠధ్వనితో ఆకలితో మాడుచున్న తన సొంత పొట్ట కోసం "దేహి" అని ఎవడైనా యితరులను వేడుకొనునా ?

యాచించేటటువంటివానికి సంసారం ఉంటే ఉండవచ్చును. లేకపోతే లేకపోవచ్చును. కేవలం తన పొట్టకోసం మాత్రమే యాచించడం అనవసరం అని కొందరి మతం. తనపుట్టుక తాను పొట్టపోసికోవలెననేయెడల, ఏ అడవిలోనో కూర్చుండి ఆకు అలములుగాని, కందమూలములుగాని తిని, కొండవాగులలోని నీరు త్రాగి, గోచీ పెట్టుకొని, పూచీలేకుండా సంసారభారం లేకుండా హాయిగా నిశ్చింతగా కాలక్షేపం చేయవచ్చునంటారు. అదే నిస్సంగత్వం అని భావిస్తూ ఉంటారు. అలాగయితే సంసార బాధ్యతలు వహించేవాడు వట్టి వెర్రివెంగళప్పయేనా ? సంసారబాధ్యత వహించడం అనేది చాలా అవ్యక్తమైన పని, తెలివితక్కువ పని అంటే అనవచ్చు. కాని, ముక్తి పొందనటువంటి ప్రతివాడూ అజ్ఞానంలోనే ఉన్నాడని అంగీకరించాలి. సంసారంలేని సన్యాసి అయినంతమాత్రాన ముక్తి పొందినాడనిగాని, వానికి ఆత్మ పరిపక్వం సిద్ధించినదనిగాని అంగీకరించడానికి వీలులేదు. కొందరు బైరాగులున్నూ కొందరు జోగులున్నూ, గంజాయి త్రాగి ఆకలిదప్పులు లేకుండా చలికి చలించకుండా, "జై ! సద్గురూ !" అంటూ మైమరచిన బ్రహ్మానంద పదవిలో ఉన్నారని వాదిస్తే, బ్రాందీ ఆనందానికీ ఈ బ్రహ్మానందానికి విశేష విభేదంలేదని వివేకంగల ప్రతివాడూ, నిషా ఖుషీ తెలిసిన ప్రతి మనిషీ అంగీకరిస్తాడు. గంజాయి లేకపోతే ప్రాణం గిజగిజలాడుతుంది.

గంజినీళ్ళకోసం యాచించే బదులు గంజాయికోసం యాచిస్తాడు. యాచనవల్ల ప్రయోజనం లేకపోతే, మరొక యోచన చేస్తాడు. రైలులో ఏ ప్రయాణికునిచెంతనైనా చేరి, ఆ బైరాగి రాగిని విరాగి చేయగలననీ, రాగిని బంగారు చేయగలననీ చెప్పి, వానికి విమోచన మార్గం చూపిస్తానని అరచేతి వైకుంఠం చూపించి, ఆ రాత్రి ఆ రైలుప్రయాణంలో ఆ బైరాగి నిద్రపోకుండా, జాగరూకుడై, గంజాయి చింతనామృతపాన విశేష మత్తచిత్తుడయ్యును అప్రమత్తుడై, ఆ ప్రయాణికుని మూట ముడి విప్పి దానికి బంధవిమోచన ముందుగా కలుగచేసి, చేతికందిన పాతిక రూపాయీల మనీపర్సునే మహాద్భాగ్యంగా స్వీకరించి, యథాలాభసంతుష్టుడై ప్రక్క స్టేషనులో దిగి పలాయనమైన తర్వాత, ఆ ప్రయాణికుడు నిద్రలేచి, అంతర్ధానమైన సిద్ధుని అద్భుతమైన మహత్తులను గూర్చి ఆత్మలో తలపోసి, ఆ సన్యాసి సాంగత్యంవల్ల తన ముడి విడిపోయినదనిన్నీ తనకు కొంత ధనబంధన విమోచనకూడా కలిగినదనిన్నీ అకస్మాత్తుగా జ్ఞానప్రబోధంపొంది, గుడ్లు తేలవేసి, గుండె స్తంభించి, నిశ్చేష్టుడై నిర్వికల్ప సమాధిలోకి పోవచ్చును. అటువంటి నిస్సంగుల సాంగత్యంవల్ల మనకు కలిగే విమోచన యీ జీవయాత్రలో ఎంతయినా ఉంది.

కనుక, గంజాయి ఆకు మాత్రమే సేవించి సద్భక్తులమని సంచరించే టటువంటి సన్యాసులకంటె, సంసారులే ఈ రైలుప్రయాణంలో, యీ జీవితయాత్రలో ఎక్కువ సుఖంగా యెక్కువ ప్రశాంతంగా నిద్రపోతారు. అయినా బైరాగులు యీ ప్రపంచంలో విశేషంగా టిక్కెట్టు లేకుండా ప్రయాణం చేస్తారు. టిక్కెట్టుతో ప్రయాణము చేసేవాడు

సంసారి. అటువంటి సందర్భంలో "బైరాగి టిక్కెట్టు" అనేది ఉండడం అసంభవం. యథేచ్ఛగా విహరిస్తూ, యథేచ్ఛగా ప్రవర్తిస్తూ, ప్రయాణం చేస్తూ, ఉండేవానికి టిక్కెట్టు అనేది కూడా అక్కరలేదు. ఎక్కడికి పోతున్నాడో వానికే తెలియదు. ఎక్కడ దింపివేసినా దిగిపోతానని అందుకు సిద్ధంగా ఉంటాడు. ఆ బైరాగి కాశీకెళ్ళినా అక్కడ స్థిరవాసిగా ఉంటాడా? ఉండడు. అక్కడినుంచి బదరీనాథ్ అంటాడు. త్రోవ పొడుగునా, బావాజీలతో కలిసి "భాయి! భాయి!" అని, చిలుముగొట్టం చేతబట్టి, చిన్మయా నందం అనుభవిస్తూ ఉంటాడు. అటువంటివానికి గంగలో మునిగినా, భంగులో తేలియాడినంత ఆనందం కలుగదు. అటువంటివానికి బ్రహ్మకపాలంలో కంటె, బైరాగుల వెంబడిలో ఎక్కువ ఆనందంగా ఉంటుంది.

ఇంతకూ చెప్పవచ్చిందేమిటంటే, ఈ బైరాగికి గంజాయి గొట్టంకంటె గమ్యస్థానం మరొకటి మహిలో నహీ... అతడు జీవిత ప్రయాణం ఎక్కడినుంచి ఎక్కడికి చేస్తున్నాడో మనకే తెలియదు. జీవిత లక్ష్యం లేదు. జీవితం అంటే లక్ష్యంలేదు.

కాని, ఆ సన్యాసి ఆ వేషం ఎందుకు వెయ్యాలి? మరొక వేషం వేసి యథేచ్ఛగా ఎందుకు తిరుగకూడదు? సంసారిగానే ఉండి జీవితలక్ష్యం ఏదీ లేకుండా యథేచ్ఛగా స్వైరవిహారం చేసేటువంటివాడు మాత్రం లేడా? ఉన్నాడు. అహోరాత్రాలు చీట్లపేక ఆడుకుంటూ, ఆ చీట్లపేక ముక్కతో లోకం అంతా మరచిపోయి ఏకం అయిపోయేవరకు తన్మయులై తపోనిష్ఠాగరిష్ఠులవలె నిద్రాహారాలు మానివేసిన నిజదార సుభోగపరిపోషణ బాధ్యతాభారమైనా యోచించక, వహించక తామరాకు మీది నీటి బొట్టువలె, స్నేహ మోహము లేని గృహస్థులవలె, రూపాయలను పెంకులవలె చూచివేసి, ధనము నింధనమువలె తగులబెట్టి చతుర్విధ పురుషార్థములకు మించినది ఈ చతుర్ముఖ పారాయణ కొలిచే పనిని ఎంచి జీవించెడి సంసారులు కూడా పేకాటబైరాగులు. వెంటవాడు బైరాగులకున్నా, పేకాట బైరాగులకున్నా వ్యత్యాసం అగపడంలేదు.

అయితే పేకాటలో డబ్బు సంపాదించినవాళ్ళు లేరా? గిండీ గుర్రపు పందెములలో జూదమాడి అశ్వవేగంతో అమితైశ్వర్యం గడించినవాళ్లు లేరా? న్యూయార్కు కాటను ధరల కళాకళలు చూచి కావలసినంత పందెం వేసి, వలవేసి వేలు లక్షలు గెల్చినవాళ్ళు లేరా? లక్షకొక్కడు ఉన్నారు. తిక్కముక్క లేక దివాలా తీసినవాళ్ళు వేలు లక్షలు ఉన్నారు. కాని, అదే అయిశ్వర్యానికి అతి సులభ మార్గం అని అంగీకరిస్తోంది లోకం. లేదు. క్షమించండి. భ్రమపడుతోంది లోకం. లేదు కనుక మనిషి అయినవానికి, ఉండే

 

# కాలక్షేపం



టటువంటి సహజసిద్ధమైన స్వభావ సిద్ధమైన, బుద్ధివిశేషం ఏమిటంటే, సూక్ష్మంలో మోక్షం కావాలి. శ్రమ తక్కువ ఫలమెక్కువగా ఉండాలి. పాఠాలు చదువకుండా, పరీక్షలు ప్యాసుకావాలి. ఫస్టుగా కాపీకొట్టి, ఫస్టుక్లాసులో పట్టభద్రుడు కావాలి. దండామార్కులనైనా సాధించి దండిగా మార్కులు వేయించుకోవాలి. ఎందుకీ తాపత్రయం? అటువంటి పట్టభద్రుడై బి. ఏ. (బాచెలర్ ఆఫ్ ఆర్ట్సు - కళా బ్రహ్మచారి)గాను తగిలించుకొన్నప్పటికీ, అటువంటి బ్రహ్మచారీ శతమర్కటః అని తీర్మానించవలసి వస్తుంది. కాషాయవస్త్రాలు ధరించిన దొంగస్వాముల వంటివారు మిగిలిన ఆశ్రమములలో కూడా ఉన్నారు.

గృహస్థాశ్రమం స్వీకరించినవారి సంఖ్య అధికం. లోకంలో పెండ్లిచేసికొని, ఇల్లు యిల్లాలు గలవారి కందరికీ, ఉన్నటువంటి కోరిక ఏమిటి? గృహస్థాశ్రమం స్వీకరించడంలో వారి అభిప్రాయం ఏమిటి? ఆశ్లేష మేమిటి? ఆశయ మేమిటి? అభిలాష ఏమిటి? "చల్ మోహనరంగా మల్లెపూల తెప్పమీద తేలిపోదము గదరా!" అనే సరదా పరదా తెరచాపఎత్తి, బ్రతుకు తెరువులో బ్రహ్మానంద మనుభవించాలని ఆశిస్తున్నారు.

కాని, యీ బ్రహ్మానంద ప్రవాహ ప్రయాణం అంత సులభమైనదా? మల్లెపూల తెప్పమీద ఎక్కినా, అది ప్రవాహంలోపడి కొట్టుకొనిపోతే, ఆఖరుకు ఆ నదీప్రవాహం సముద్రములో కలిసినప్పుడు యీ మల్లెపూల తెప్పకూడా మహాసాగరం పాలవుతుంది. ఎంతో కష్టపడి తెడ్డువేసి నసే తిప్ప చేపలు పట్టేవాళ్ళు కూడా (ధీవరులు కూడా) దారి తప్పి నట్టనటి సముద్రంలో కొట్టుకొని పోతారు. మద్రాసులో చేపలు పట్టబోయి మత్స్యపురి (చేపల పట్టణం) పోస్తాకు చేపలవలె కొట్టుకొని పోయినారు.

ధీవరుడు దీక్షతో
తెడ్డు వేయకను
నావ ఏరీతిగా
నదిని దాటించు!

ధీవరుడు అంటేనే ధీశాలి. బుద్ధిలో శ్రేష్ఠుడు. అటువంటి వానికికూడా మహాసాగరంలోకి వెళ్లినతర్వాత అది అలవి కాని అగాధంగా ఉంటుంది. బ్రహ్మాండమైన సొరచేపల కెర యవుతాడు. ముత్యాలు తీయబోయి మున్నీట మునిగిన ధీవరుని గూర్చి కన్నీరు మున్నీరుగా ఏడుస్తారు వాని పిల్లలు, వాని యిల్లాలు. దరిగానక, దారిగానక ఎందరినో మింగిన సంద్రమును చూచి ఏడుస్తారు.

సముద్రంలో ముత్యాలు ఉన్నాయి. సముద్రంలో రత్నాలు ఉన్నాయి. సముద్రుడు అంటే రత్నాకరుడు. ఈ ఆశతోనే సముద్రంలోకి దిగుతాము. ఈ ఆశతోనే సముద్రాల దాటవలెనని సంసారు లందరూ తాపత్రయపడుతున్నారు. అపార పారావార వ్యాపార పారీణులేపారి పరిపరి విధాల ఆనందం అనుభవించడానికి అనంత కోటిసాధనోపాయాలు అవలంబిస్తున్నారు- ఏ ఆశ్రమంలోనైనా శ్రమ లేకుండా ఆనందం అనుభవించాలి, అదే అఖిలలోక ఆత్మాభిలాష-అదే ఆధునిక విజ్ఞాన వికాస విలాస వాసనల విచిత్ర విశిష లక్షణము. కోడిగుడ్లను పొదగవలెనంటే కొన్ని దినాలు పట్టగలదు కాని, యీ అండములను అరగడియలో పక్వం చేయగల మర ఉంది. దీనినే *Incubator* (అండదోహదకరండం) అంటారు. ఈ యంత్రంలో పొదిగిన గుడ్లలోనుంచి, ఈ అండములను పెట్టిన కరండములోనుంచి (పెట్టెలో నుంచి)— ఎగిరివస్తాయి ఎన్నో కోడిపిల్లలు. వాటిని వెంటనే ఉడకబెట్టి *Chicken essence* కుక్కుట కిశోరసారమును పాకశాసనులవంటి బట్లరులు ప్రయాసలేకుండా తయారుచేస్తారు. నవమాసాలు గర్భంధరించవలసిన భారంలేకుండా అంతకంటె అల్పకాలంలోనే అతివలు శిశువుకలిగే సాధనోపాయము, పిండదోహదకరండం, ఒకటి ఎందుకు కనిపెట్టకూడదు? దంతములతో శ్రమపడి నమలి నెమరు వేయ నక్కర లేకుండా, జీర్ణకోశం శ్రమపడి జీర్ణంచేసికొనవలసిన అగత్యంలేకుండా, సిద్ధజీర్ణధారకములు (*Predigested Foods*) తయారుచేసి, జనులందరూ తయారు తిన్నట్లుగా తింటే తీరెన వుస్తాదులవుతారా? జీర్ణకోశం పనిలేనికోశమైపోతుంది. జీర్ణకోశమే జీర్ణవస్త్రంలాగున జీర్ణమై విశీర్ణమై శిథిలమైపోతుంది. శరీరాన్ని సుఖపెట్ట, వలెనని ప్రయత్నిస్తే, యీ శరీరానికి సుఖం విముఖం అవుతుంది. ఇది సృష్టికర్త మర్మం. ఇది సృష్టి ధర్మం. ఇది మన కర్మం.

"కష్టపడకుండా ముష్టియెత్తడం ఎందుచేత? ఏదైనా కూలిపని చేసికోరాదురా?" అని గుమ్మంలోకి వచ్చిన బిచ్చగానికి పిడికెడు బియ్యంపెట్టి, చీవాట్లు పెడ్తాము. "రామచంద్ర పరబ్రహ్మణే నమః" అని సరాసరిగా యింటిలోనికి చొరబడే పంచాంగ బ్రాహ్మణునకు, వెంటనే ఉపాదానంవేసి, వీలైతే మన శోకనాశనంకోసం శాకదానం కూడా చేస్తాము. "భవతీ భిక్షాం దేహి" అనవలసినవాడు బ్రహ్మచారి. గురువువద్ద శుశ్రూషకై ప్రవేశించినవాడు ఆ గురుకుల శిక్షణ పూర్తి అయ్యేవరకు ఆ గురుకులంలోనే ఉండి భిక్షాందేహీ యని గృహస్థుల వద్దకు వెళ్ళి తన భుక్తికి కావలసిన భోజనం సంపాదించుకోవాలి. ఇది పూర్వాచార గురుకుల సంప్రదాయము. దీని అర్థం ఏమిటంటే, విద్యాశిక్షణ పొందేటటువంటి విద్యార్థులను పోషించవలసిన భారం, బాధ్యత యావత్తూ ఆ గ్రామస్థులదే. విద్యార్థి తన విద్యాశిక్షణకోసం ఎట్టి ఏగాని కూడా, ఏ విధమైన రుసుము రూపంలోనూ విద్యాశాలకుగాని కళాశాలకుగాని చెల్లించకూడదు.

విద్యాశాలలు కూడా విద్యార్థులవద్ద నుంచి జీతాలు వసూలు చేయకూడదు. ఆకాలంలో శిష్యులకు జరిమానాలు గురువులకు అవమానాలు-విద్య అనేది అన్నసత్రములో అన్నం పెట్టినట్లుగా విద్యార్థికి పెట్టవలెనన్నారు. ఈ విద్యాదాన ధర్మశాలలను సంఘం లేదా, సర్కారు పోషించవలెనన్నారు. ఈకాలంలో వైద్యశాలలే పూర్తిగా ఉచిత వైద్యశాలలుగా లేవు. వైద్యశాలలలో లేని ధర్మసంస్థాపన ఇక మన విద్యాశాలలలో అసలే లేదు. వైద్యశాలలో తంటాలు పడితే (డాక్టరును ఆశ్రయిస్తే, ఆనందింపజేస్తే) సీటు అనగా ప్రవేశావకాశము లభిస్తుంది. కాని, విద్యాశాలలో గురువు నాశ్రయించినా, శుక్రాచార్యులను ఆశ్రయించినా, సూర్య చంద్రాదుల నాశ్రయించినా, విద్యార్థులకు ప్రవేశావకాశము లభించడం దుర్ఘటం, దుష్కరం, దుస్తరం, దుస్సహంగా ఉంది. విద్యార్థి ఎన్ని గ్రహాల నాశ్రయించినా, ఎన్ని గ్రహశాంతులు చేసినా, ఆ విద్యార్థిని శని గ్రహమే ఆశ్రయిస్తోంది. వైద్యశాలకంటె విద్యాశాలకు యీ గ్రహగతి పట్టింది. ఇక వైద్య విద్యాశాల గతి చెప్పనే అక్కరలేదు. బ్రహ్మరుద్రాదులు స్వయంగా వచ్చి తమ పిల్లలకు నూటికి నూరుమార్కులు వచ్చాయని ఋజువు చూపించినప్పటికీ వైద్యవిద్యాశాలలో సీటు దొరకడం వారి అదృష్టం. అందులోనా, కొన్ని ఆటంకాలు అభ్యంతరాలు, ఆక్షేపణలు, అవరోధాలు ఉంటాయి. బ్రహ్మయొక్క కుమారునకు సీటు యివ్వడానికి కొంత అభ్యంతరం ఉంటుంది. కారణం ఏమంటే, బ్రహ్మ బాగా విద్యాధికుడు. ఏ విద్యార్థియొక్క

## మా పాఠకులకు మరొక క్రొత్త ఆకర్షణ

# ఆంధ్రపత్రిక

### సచిత్ర వారపత్రిక

## విక్టర్ హ్యూగో
## ప్రసిద్ధ నవల అనువాదం

ఫ్రెంచి నవలా రచయిత విక్టర్ హ్యూగో నవలల్లో ప్రసిద్ధమైన "హంచ్ బాక్ ఆఫ్ నాటర్ డామ్" (Hunchback of Notre Dame) నవల ఆంధ్రానువాదం త్వరలో మా వారపత్రికలో సీరియల్ గా ప్రచురింపబడ నున్నదని తెలుపుటకు సంతసిస్తున్నాము. మా సీరియల్స్ అన్నిటినీ పాఠకులు ఆదరించినట్లే ఈ క్రొత్త సీరియల్ ను కూడా ఆదరించగలరని విశ్వసిస్తున్నాము.

—సంపాదకుడు.

తండ్రిగాని, తాతగారు, తాత తాత విధాతగాని చదువుకున్నవారై ఉంటారో, విద్యాధికులై యుంటారో అటువంటి విద్యార్థుల దరఖాస్తులను వెనక్కి త్రోసివేయాలి. ఏవిద్యార్థులైతే వెనుకకు త్రోసివేయబడిన కుటుంబాలవారో, కులాలవారో, అటువంటి విద్యార్థులకు వెంటనే వైద్యవిద్యాశాలలో సీటుయివ్వాలి. బహుశః శివుడు (రుద్రుడు) స్మశాననివాసియగుటవల్ల శివుని కొడుకునకు వెంటనే సీటు యివ్వవచ్చు ఆ శివునకు కైలాసగిరి (వెండి కొండ) అసలు నివాసమని, అందరికీ తెలిసిన విషయమే - కాని, అతనికి మంచి మాగాణిభూమి కుంటగాని సెంటుగాని లేదనే కారణంచేత రుద్రుడు వెనుకబడిన జాతివాడని యెంచి రుద్రుడు దరిద్రుడని యెంచి ఆ క్షుద్రుని కుమారునకు ముందుగా సీటు యివ్వవలసియుంటుంది. బ్రహ్మపుత్రునకు సీటుదొరకడం కష్టమైన పరిస్థితిలో బ్రహ్మచారినని చెప్పకొనెడి, పట్టభద్రుడైన వాతే యిక బ్రహ్మమానస పుత్రుడు కావాలి. "వైద్య విద్యాబ్రహ్మచారి" (బాచెలర్ ఆఫ్ మెడిసన్) అనే పట్టబిరుదం స్వీకరించినవాడే బ్రహ్మచారి. ఈవిధంగా జరుగుతూ ఉండడం కొందరు గమనించి ఈ వైద్యవిద్యా విధానం చెడిపోతున్నదనిన్నీ వైద్యవిద్యకు వ్యాధి ప్రవేశించినదనిన్నీ, వైద్యవిద్యకే వైద్యం చేయవలసి యున్నదనిన్నీ సంకల్పించి యున్నారు. మన విద్యా విధానమే తెలివి తక్కువ పద్ధతిని అనుసరిస్తూ ఉన్నదనిన్నీ మన విద్యావిధానంలో అజ్ఞానం చాలా ప్రవేశించిన దనిన్నీ పెద్దలు బల్లగుద్ది వాదిస్తున్నారు. మన విద్యల్లోనే అవిద్య ఉన్నదనే గొడవల, మన విద్యార్థులు విద్యాశాలలో నేర్చుకొనేది అవిద్యయేగాని విద్యకాదని విదితమవుతోంది. అందుకనే గురువులకు పంగనామములు పెట్టగల స్థితిలో విద్యార్థులున్నారు. గురువులు చదువుకొన్నది పాతకాలపు అవిద్య ఈకాలపు శిష్యులు అది గ్రహించారు. ఈ విద్యలో అవిద్య చాలా ఉన్నదని శిష్యులే హెచ్చరిస్తున్నారు. "ఈ రాజులు రాజులే భువి తరాజులుగాక" అన్నట్లుగా ఈ "విద్యలు విద్యలే యువక శేఖలు బాధలుగాక" అని యువకులు, అనగా యీతరమువారు హెచ్చరిస్తున్నారు. బ్రతుకు తెరువు చూపని చదువు ఇది. జీవితలక్ష్యం ఏమిటో తెలియదు. వైరాగి ప్రయాణం ఎంతదూరమైనా సాగవచ్చు. మధ్యలోనే ఆగవచ్చు. ఏ మహాత్ముని అనుగ్రహమైనా లభిస్తే బంగారంచేసే ప్రభావం లభించవచ్చు యోగం మంచిదైతే, గ్రహాసంయోగం మంచిదైతే గవర్నమెంటు ఉద్యోగమే లభించవచ్చు. కాని, అదంతా వాళ్ళవాళ్ళ అదృష్టం. ఇదంతా చదువుల ప్రయిజ్ లాటరీ ఏదీ నిశ్చయం లేదు. ఉపాధులు లేని మహోదధిగా నిరుద్యోగ ప్రపంచం తయారవుతోంది. ఇటువంటి నిర్వ్యాపార పారావారంలో ఈసంసారసాగరం తరించడానికి తరణోపాయం తరుణోపాయం తరుణవయస్కులకు కూడా తల్లక్రిందులుగా తపస్సు చేసినా కన్పించదు.

కాని, వయస్సు ముదిరిన రామజోగిగారికి ఒక్క మంచి ఉపాయం కన్పించింది ఈ మధ్య. సూర్యనారాయణ పురంలో వర్షాలు కురియక ప్రజలు తల్లడిల్లిపోయినారు. అందుకు కారణం ఏమిటని పెద్దలందరూ ఆలోచించారు. లోకంలో పాపం పెరిగిందన్నారు. ప్రజల కడుపు కాలిపోతోంది. పంటలు భస్మమైపోతున్నాయి. అందువల్ల నవగ్రహాలను సంతృప్తి పరుస్తూ పెద్ద యజ్ఞం చెయ్యాలని రామజోగిగారు సలహా యిచ్చారు. ఇదంతా ఎట్లా చెయ్యాలో ఆయననే నిర్ణయించి చెప్పండని వర్తకులూ, భూస్వాములూ అందరూ విన్నవించారు. రామజోగిగారు అందుకు సమ్మతించి నవగ్రహ యజ్ఞానికి కావలసిన వేయి నేతి డబ్బాలు వగైరా యితర పదార్థములను వసూలు చేశారు. పందిళ్ళు వేయించారు. కావలసిన ద్రవ్యం ధనికులవద్ద వసూలుచేసి పదివేలవరకూ పదిలంచేసి, పని ప్రారంభించారు. జగజ్జేగీయమానంబుగా యజ్ఞంయథావిధిగా జరిగింది. గ్రామస్థులందరూ రామజోగి సోమయాజిగారికి రవ్వల సింహతలాటమును పది సవరసుల బంగారంతో చేయించి చేతికి అలంకరించారు. ఆయనకు పట్టుబట్టలు సమర్పించి నూటపదార్లు నోట్లు కట్టగా చదివించారు. సక్రమంగా యజ్ఞం జరిగింది. యజ్ఞంజరిగిన కొంతకాలానికి యథావిధిగా వర్షం కురిసింది. రామజోగి సోమయాజిగారికి ఆ గ్రామంలో అదివరకు తగిన జరుగుబాటు లేక అవసరానికి అయిదు రూపాయిలు కావాలని యాచిస్తే, 'హాజరుగా లేదు పైకం' అని జవాబుచెప్పి లక్షాధికారైనా భిక్షపెట్టేవాడు కాడు. ఇప్పుడు యీ

(53-వ పేజీ చూడండి)

# 1+1=0

శ్రీ ఇచ్ఛాపురపు
జగన్నాధరావు

"శేఖర్ లేచాడా నర్స్?"

డాక్టర్ ప్రకాశం నడక నర్స్ రేఖకి వినపడినట్లే లేదు. అందుచేతనే, అతనువచ్చి తన వానివిషయం అడిగేదాకా, ఆమె కతని రాక తెలియనే లేదు ... కిటికీలోంచి బయటికిచూస్తూ, నెమ్మదిగా పడుతోన్న చినుకులూ, నల్లగా కొండలమీద వ్రేలాడుతూన్న బరువైన మేఘాలూ, చుట్టూ బలిసి అలుముకున్న చెట్లూ, ఆమె చాలా బలంగా ఆకర్షించినట్లుచూస్తూ, లీనం అయిపోయింది.

ఒక్కసారి ఈ సాగిపోతోన్న ఆలోచనలనించి తేరుకుని నర్స్ లేచి నిలువబడి, 'గుడ్ మార్నింగ్ డాక్టర్' అన్నది.

'మార్నింగ్ రేఖా... శేఖర్ లేచాడా?'

'లేదు...'

'టెంపరేచర్...'

'సబ్ నార్మల్ లే ఉంది - ఇప్పుడు. ఉదయంనించీ కొంచెం రిసీడ్ అయి తిరిగి రైజవుతోంది ..'

'చార్ట్ -'

రేఖ త్వరగా గదిలోనించి బయటికి నడిచింది - రెండో గదిలో శేఖర్ ఉన్నాడు. ఒక్కసారి అతనిముఖంలోకిచూసి, చార్ట్ తీసుకుని, డాక్టర్ గదిలోకి వెళ్లింది.

డాక్టర్ ఏదో ఆలోచిస్తూ, కిటికీలోనించే బయటికి చూస్తున్నాడు. రెయిన్ కోట్ నించి పడుతోన్న నీటిధారలు చుక్క చుక్కా కలిసి చిన్న ప్రవాహంగా అయి డాక్టర్ జోళ్లకిందకి పోతున్నై... బహుశా డాక్టర్ ని ఆ దృశ్యం- కిటికీలోనించి - ఆకర్షించి ఉంటుంది... తన్మయుడైనట్లు చూస్తున్నాడు.

ఒకటి - రెండు... నాలుగు నిముషాలు.

వర్షం క్రమంగా జోరవుతూంది. కొద్ది చినుకులు కిటికీలోంచి పడగానే డాక్టర్ కి తెలివి వచ్చినట్లు ఉంది ... త్వరగా కిటికీనించి దూరంగావస్తూ 'అప్పన్నా! వచ్చి తలుపువెయ్యి!" అని కేకవేశాడు.

ఆచిన్న హాస్పిటల్ లో ఒకమూలకూర్చుని ముసలి అప్పన్న కునికిపాట్లు పడుతున్నాడు .. నర్స్ కి తెలుసు. ఆమె చేతిలోని చార్టు టేబిల్ మీదఉంచి కిటికీదగ్గరికి వెళ్ళి తలుపులు మూసింది.

'వాడు - వట్టి బద్ధకస్తుడై పోతున్నాడు ...' గొణిగాడు డాక్టర్.

'ముసిలాడు...'

నాలిక కరచుకొంది రేఖ ... ప్రకాశం షాక్ తిన్నట్లు వెనుదిరిగాడు. ఒక్కసారి నల్లటి ఆమె కళ్ళూ, దాహంతో ఉన్న అతనికళ్ళూ కలుసుకున్నాయ్. చాలా సిగ్గుపడుతోన్న రేఖ తన, అందాలని దాచుకుంటూన్నకొద్దీ అవి మరీ ప్రస్ఫుటాలు కాసాగాయ్... బరువుగా తలవంచుకున్నది రేఖ.

బలమైన డాక్టర్ కండరాలు చాలా నీరసపడ్డాయ్ - ఆ మైకంతో... కుర్చీలో కూర్చుంటూ, 'కూర్చోండి' అన్నాడు.

'చార్ట్...'

'ఆఁ...ఇలా ఇవ్వండి...'

పేరుకిమాత్రం ఆ చార్టుని పరీక్ష చేస్తూ, "రెగ్యులర్ 'యు'" అన్నాడు ప్రకాశం.

'అవును. చాలా అన్ స్టెడీ' అన్నది రేఖ.

"ఆముంగు, తెలివొచ్చినప్పుడు ఇవ్వండి- ఈవెనింగ్ మారుస్తాను"

రేఖ మాటలాడలేదు. అలాగే కూర్చున్నది. కొద్దినిమిషాలు పైన వర్షపుచప్పుడు తప్పిస్తే మరేమీ లేకుండానే గడిచిపోయాయ్.

"మీ... రెలెటివ్ ఉన్నారా?"

సాధ్యమైనంత సామాన్యంగా ధ్వనించేలా అడిగాడు ప్రకాశం ... ఆ ప్రశాంత వాతావరణంలో, కొండలమధ్య, మూడువేల అడుగులఎత్తున,ఉన్న ఆ హాస్పిటలు... ఏజన్సీ హాస్పిటలు. ఊరు ఉన్నకొంచెమూ అరమైలు దూరంగా ఉన్నది. అందులో ఉన్న నాలుగు ప్రాణాలలోనూ ఒకటి తెలివితప్పిఉన్నది; ఒకటి నిద్రపోతున్నది. రెండుజీవాలు - నిండు యౌవనంతో మిసమిసలాడుతూ, తమ ఉద్యోగధర్మాలని నిర్వర్తించుకోడానికి ప్రయత్నిస్తూ, చేసేపని ఏమీలేక, మాట్లాడుకోసాగాయ్.

'ఉన్నారండి -'

'మీ...?'

'ఫ్రెండే లెండి... రెలెటివ్ కాదు'

మళ్లా కొద్ది నిమిషాల నిశ్శబ్దం - బరువుగా.

'అతను...ఎలా ఉన్నాడంటారా?'

'ఎవరు?' పరధ్యాన్నంగా అన్నది రేఖ.

'శేఖర్...'

అనుమానం తొణుకుతోన్న కళ్ళతో చూస్తూ, 'నాకేం తెలుసు డాక్టర్? - మీకు తెలియాలి' అన్నది రేఖ.



'మీకు - చాలా దగ్గర స్నేహితుడేమో వనుకు నెంత అభిమానంగా సేవ చేస్తున్నారు ......'

రేఖ ఒక్కసారి తన రెండు కళ్లనీ డాక్టర్ వైపు తిప్పి, 'మీర నేద - ' అన్నది వేడిగా.

'నోనో ...అది కాదు - అందుకని మీతో నిజం చెప్పడానికి కొంచెం సంశయంగా నే ఉంది' అన్నాడు ప్రకాశం.

నర్స్ తన ముఖంలక్షణాలని ప్రశాంతం చేసుకోడానికి ప్రయత్నిస్తూ 'మీ యిష్టం' అన్నది.

'అతను - చాలా క్రిటికల్ గా ఉన్నాడు' అన్నాడు డాక్టర్.

ఆక్షణంలో అతను రేఖ ముఖలక్షణాలని కనిపెట్టలేదు... ప్రక్కకి తిరిగి ఉన్నాడు.

'బహుశా, రేపు ఉదయానికి...'

'అంత ప్రమాదమా డాక్టర్?'

'అనుకుంటాను ... పల్స్ వీకెన్ అవుతోంది. పీక్స్ క్రమంగా నార్మల్ కి దూరం అవుతున్నాయ్...' చార్ట్ లోని కర్వ్ పీక్స్ నించి ఏక్సిస్ కి చేత్తో గీతలు గీస్తూ అన్నాడు డాక్టర్.

రేఖ ఏమీ మాట్లాడలేదు. ప్రకాశం ఏమీ మాట్లాడలేదు. వర్షం తగ్గాక ఇద్దరూ ఇళ్ళకి వెళ్ళిపోయారు.

*   *   *



"వాడు వట్టి బద్ధకస్తుడై పోతున్నాడు" గొణిగాడు డాక్టర్

# ★ 1 + 1 = 0 ★

డాక్టర్ ప్రకాశ్ అక్కడ రెండేళ్లనించి పనిచేస్తున్నాడు...ఏజన్సీ హాస్పిటల్‌లో. పూర్వం అతను మామూలు డాక్టర్లలాగే ఒక పట్టణంలో ప్రాక్టీసుచేస్తూ ఉండేవాడు. చాలావరకూ అతని ప్రాక్టీసూ బాగానే ఉండేది.

తరువాత అతను వివాహం చేసుకున్నాడు. లత అతని జీవితంలో అడుగు పెట్టడంతో అతని కష్టాలు ప్రారంభం అయాయి.

ఆమెకి సుఖం కావాలి; తన విధినిర్వహణ ఎట్లాపోయినా. విషయవాంఛలు విపరీతంగా ఉన్నవాళ్ళని వివాహంలో స్వీకరించాల్సింది డాక్టర్లుకాదు...ఆ పాఠం ప్రకాశం కొంచెం ఆలశ్యంగా నేర్చుకున్నాడు.

లత తన కాలమంతా థియేటర్లలోనూ ప్రయాణాలలోనూ గడిపేది. ప్రకాశం మొదట బాధపడ్డాడు - తరవాత పరిస్థితులకి అలవాటు పడగలిగాడు. లోకం నవ్వసాగింది. 'పోనీ' అనుకున్నాడు. తాను ఆమె విషయంలో ఏ విధినీ నిర్వహించలేకపోతున్నానని అతనికి తెలుసును. ఆ జ్ఞానమే అతన్ని పట్టిఉంచి, లతకి పూర్తి స్వాతంత్ర్యం ఇచ్చింది.

ఒక్క సంవత్సరంలో ప్రకాశం పూర్తిగా మారిపోయాడు - లోకం నవ్వులని వింటూ బాధపడకుండా ఉండడం నేర్చుకున్నాడు. లతని ఒక స్నేహితురాలిగా మాత్రం చూడడం నేర్చుకున్నాడు - ఇంకా, జీవితాన్ని పాడిగా గడపడానికి కావాల్సిన పాఠాలని నేర్చుకున్నాడు.

అలాగే గడిచే ఒకరోజున, తాను ఇంటికొచ్చేడు. ఎందుకో అనుకున్నాడు - ఇంటిలో అందరూ గుమిగూడారు. వందలు ...లత చచ్చిపోయింది. హార్ట్ ఫైల్యూర్ అనుకున్నాడు తాను...కాని పోస్ట్‌మార్టమ్ 'ఆత్మహత్య' అన్నది.

తల గిర్రున తిరిగింది...లత ఎందుకు ఆత్మహత్య చేసుకోవాలి?

కనుమాపు మేరలో ఏ కారణమూ కనిపించలేదు. బహుశా, ఆమె తన ప్రవర్తనకి పశ్చాత్తాపపడి ఉంటుందా?...అయినా, ఆ పశ్చాత్తాపం నిరూపించే పద్ధతి ఇదా?

అతని కేమీ బోధపడలేదు. కొద్దిరోజులు పోయాక ఆమె డైరీ అతని కళ్లపడ్డది. తీసి చూశాడు. కొన్ని ఎంట్రీలు...

మార్చి 6: తిరిగి, ఆ థియేటర్‌లో ఆ యువకుడు - అవును. శేఖరమే. రెండు గంటలసేపూ నావంక చూస్తూనే ఉన్నాడు ...ఏంచేసేదీ? వచ్చేద్దా మనుకున్నాను. కాని, పిరికాల వస్తాడని భయంవేసింది.

ఏప్రిల్ 1: అతనితో మాటలాడాలని అనుకోలేదు - కాని, బీచ్‌లో కనిపించి పలకరించాడు. పాతరోజులన్నిటినీ జ్ఞప్తికి తెచ్చాడు. అతని వైఖరిచూస్తే భయం వేసింది. ఉత్తరాల ప్రసక్తి తెచ్చాడు... ఇచ్చేమని అడిగాను. నవ్వి ఊరుకున్నాడు ...భగవాన్...ఏమి టతని ఉద్దేశం?

ఏప్రిల్ 15: ఎవరో ఒకర్ని మోసమైనా చెయ్యాలి; నన్ను నేనైనా మోసంచేసుకోవాలి. నన్ను నమ్ముకున్న ఆయనని మోసం చెయ్యలేను - నా ప్రాణం చేతిలో ఉన్న శేఖర్‌నీ మోసం చెయ్యలేను - మూడోమార్గమే ఉత్తమంలా ఉంది.

ఏప్రిల్ 18: ఈ సాయంత్రం ఆటకట్టేటట్లు కనిపిస్తుంది. జీవించినది చాలు. అతను నన్ను పూర్తిగా చంపాడు.

ఆరోజునే లత విషం మింగింది.

శేఖర్!...శేఖర్ - ఎవరది?

ఆమె కాగితాలన్నీ వెదికాడు ప్రకాశం. ఏమీ ఆచోకీ దొరకలా. ఆమె చిన్ననాటి స్నేహితు డల్లే ఉన్నాడు. అంతకన్న అప్పటికేమీ ఆచోకీ దొరకలేదు - ఒక్క విషయం మాత్రం ప్రకాశం పూర్తి అవగతం చేసుకున్నాడు...లతని చంపిన దుర్మార్గుడు - అతనని.

తరవాత అక్కడ లేకపోయాడు ప్రకాశం. ఒకసారి ఈ ఉద్యోగానికి అప్లికేషన్లు అడిగారు. తాను అప్లైచేశాడు. ఈ రెండేళ్లనించీ ఇక్కడే ఉండిపోయాడు. కొండలమధ్య, అడవులమధ్య, ప్రశాంతమైన జీవితం.. తనని చూసి నవ్వుతోన్న ఆ లోకానికి ఎన్నో వందలమైళ్లు దూరంగా, నాగరికతకి ఎన్నో వందలమైళ్లు దూరంగా, చీకులేని బ్రతుకు.

అలా బ్రతుకుతోన్న తన జీవితంలోకి మళ్ళా ఈ శేఖర్ వొచ్చాడు. అతను ఆ వూళ్లో కొద్దిరోజులు ప్రశాంతంగా గడపడానికొచ్చాడు. మనశ్శాంతికోసం వచ్చానన్నాడు. త్వరలో ప్రకాశం, శేఖర్ స్నేహితులయారు. త్వరలో అతనెవరో తెల్సింది డాక్టర్‌కి.

చిత్రమైన సంఘటన - అనుకున్నాడు ప్రకాశం.

వాన తగ్గింది. చిన్న చినుకులు మాత్రం పడుతున్నాయ్. తడిగాలి బలంగా వీస్తూన్నది.

ప్రకాశం బుర్రలో వెయ్యి ఆలోచనలు బలంగా పనిచేస్తున్నవి. తనని సర్వనాశనం చేసిన శేఖర్......

"అంత ప్రమాదమా డాక్టర్?"

శేఖ! నవ్వుకున్నాడు....ఆమె అతని కోసం ఎంత తహతహలాడుతూందో తనకి తెలీదనుకున్నది!...నర్స్! ఆ సౌందర్యం అంతా శేఖర్ కోసం!...తనని నాశనంచేసిన శేఖర్ కోసం!

'లతా! ఎందు కంత తొందరపడ్డావు!' అనుకున్నాడు ప్రకాశం, పశ్చాత్తాపంతో ...'నేను నిన్ను క్షమించిఉందును. రాక్షసత్వం నిన్ను చంపకుండా అడ్డుకుని ఉందును. ఈరోజు నీచేత్తో ఈ ధూర్తుణ్ని ..." అనుకున్నాడు...

"భోజనం బాబూ!"

కుక్ వెళ్ళిపోతాడు. "కానీ" అంటూ కిచెన్‌వైపు నడిచాడు ప్రకాశం. "అయినా ఏం? నర్సే చేస్తుంది ఆ పని...ఏ బంగారు చేతులైతే నేం? ప్రాణం తీయడానికి! లతకే బనులురేఖ..." అనుకున్నాడు.

* * *

రేఖ రెయిన్‌కోట్ తీసి పిడిసి లోపలికొస్తూ, 'హాలో రామూ! ఏంచేస్తున్నావ్?' అన్నది గట్టిగా.

'ఏముంది! మరో నవల చదువుకుంటున్నాను...నువ్వుమాత్రం నీపని యధావిధిగా సాగిస్తున్నావు. నేను బోర్ అయిపోతున్నాను." అన్నాడు రామారావు గుక్క తిప్పకుండా.

రేఖ లేతగా నవ్వి, 'డ్యూటీ...' అంది.

'అందులో, పేషెంట్ కూడా ఫ్రెండ్...'

త్రుళ్లిపడ్డది రేఖ...'ఈ సంగతి ఎవరు చెప్పారూ?' అన్నది.

'తెలిసిందిలే...'

రామూ నవ్వి ఊరుకున్నాడు. 'వంట అయిందా అమ్మా?' అంటూ రేఖ లోపలికి వెళ్ళిపోయింది తన భావోద్రేకాన్ని కప్పిపుచ్చుకునేందుకు.

భోజనాలవగానే రాము నిద్రపోయాడు. రేఖ ఆలోచనలో పడింది. ఈ సంగతి రాముకికూడా తెల్సిపోయింది!

'నా జీవితంలో ఎందుకు అడుగుపెట్టావు శేఖర్!' అనుకుంది విచారంగా రేఖ... అనవసరంగా తాను అతనికి దొరికిపోయింది. తన జీవితాన్ని అతనికి వశం చేసింది.

"చాలా క్రిటికల్ గా... '...' బహుశా రేపు ఉదయానికి..."

గుండె తొందరగా కొట్టుకుంది... డాక్టర్ ఎందుకలా అన్నాడు? శేఖర్ కి తగిలిన దెబ్బ పెద్దది కాదు. కొంత రక్తం పోయింది. అంతే! తెలివి లేకపోయినా, అతని స్థితిలో క్రిటికల్ ఏముంది?

'ఉంటే బాగుండును' అనుకుంది రేఖ ...తాను రాముకోసం ఇన్నాళ్లు వేచి ఉన్నది. అతనూ తానంటే చాలా అభిమానంగా ఉన్నాడు. త్వరలో తాను పెళ్ళి చేసుకుని ఈ ఉద్యోగం వదిలేసి హాయిగా బ్రతుకవచ్చును. అందరూ అంగీకరించిన ఈ పెళ్ళి శేఖర్ మూలంగా తప్పిపోతుంది- అతను బ్రతికిఉంటే—

'నిన్ను నా దాన్ని చేసుకుని తీరతాను రేఖా!'

పిచ్చిగా అనేవాడు శేఖర్ ...తాను ఊరుకునేది. అవి, రాము మనస్సు తెలియని రోజులు. ఆవేశమాత్రం ఉండి, నిశ్చయం లేని రోజులు. ఆ మైకంలో పడి తనని తాను కూలద్రోసుకున్నదా?

'ఏముంది నర్స్! డాక్టర్లు పొరపాటు చెయ్యాలంటే ఎంత సులువు! చూడండి ఆ ఎర్రసీసాలో - ప్యూర్ పాయిజన్. కొంచెం వీక్ స్టేట్ లో ఓ గ్రెయిన్ కలిపితే, సెటిల్!'

ఎప్పుడో చెప్పాడు డాక్టర్. ఒక్కసారి జ్ఞప్తికి వచ్చింది. ఓ నాడు ఆ సీసా తీసి చూసింది...' పర్మాంగనేట్ లా ఉంది డాక్టర్!'

'అలానే ఉంటుంది'

రేఖ ముఖంలోకి ఒక్కసారి దౌష్ట్యం, పట్టుదలా వొచ్చాయి. "సారీ శేఖర్-నువ్వు మళ్ళా లేవవు. మన ప్రణయం నీతో చచ్చిపోతుంది" అనుకున్నది. ఏం చెయ్యాలో తనకి బాగా తెలుసు.

* * *

నాలుగు గంటలకే చీకటిపడింది-మబ్బులు బాగా కమ్ముకొనడాన్న.

శేఖర్ నెమ్మదిగా మంచంమీద ఒత్తిగిల్లి, "రేఖా!" అని పిలిచాడు.

డాక్టర్ రూమ్ లో ఉన్న రేఖ ఒక్కసారిగా లేచి, డాక్టర్ వేపు చూసి ఆగిపోయింది. 'పదండి' అన్నాడు డాక్టర్.

"హల్లో! ఎలా ఉంది?" అన్నాడు ప్రకాశం.

"నీరసం - అంతే...చాలా సేపు నిద్రపోయాను గా!" అన్నాడు నీరసంగా శేఖరం.

'కాఫీ...'

'తెస్తాను'

రేఖ వెళ్ళి అప్పన్నని ఇంటికి పంపింది.

'చాలా గట్టిగా తగిలింది దెబ్బ - సైకిల్ రాతిమీదకి పడిపోయింది. మరేం ప్రమాదం లేదుకదూ?' అన్నాడు శేఖర్.

'అంటే మీరెలా అడుగుతారు?'

శేఖర్ చిన్నగా నవ్వాడు. 'ఊఁ... మీరు చాలా శ్రమ తీసుకున్నారు. ముఖ్యంగా నర్స్ - మహా చల్లని చేతులు!'

ప్రకాశం ముఖం నల్లబడింది. రేఖ గుండె జల్లుమన్నది.

కాఫీ ఇస్తూ, 'సాయంత్రానికో డోస్ ఇస్తాను. ఉదయానికి బెస్టుగా ఉంటారు. రెండు మోతాదులు రాత్రి తీసుకోండి' అని, ప్రిస్క్రిప్షన్ రాసి ఇచ్చాడు రేఖకి ... అక్కడ కంపౌండింగ్ ఆమె తరుచుగా చేస్తూంటుంది.

'మందు కలిపి తీసుకురండి'

నర్స్ వెళ్లి అలా చేసింది. ప్రక్క టేబిల్ మీద సీసా ఉంచుతూ, 'ఇంకో పావు గంటలో ఒకటో డోస్. పదిగంటలకి రెండు. తెల్లవారుఝామున మూడోది' అన్నాడు ప్రకాశం.

కొద్దిసేపయ్యాక ప్రకాశం చెప్పినట్లు రేఖ మందు గ్లాసులో పోసి ఒక డోస్ ఇచ్చింది. ఆమె చేతులు వణుకుతున్నా, సాధ్యమైనంత దృఢంగానే ఇచ్చింది. క్రీగంట ప్రకాశం అదంతా కనిపెడుతున్నాడు.

'వొస్తాను - రాత్రి మరిచిపోకండి'

ప్రకాశం తొందరగా ఇంటివైపు నడిచాడు. కొద్దినిమిషాలయ్యాక, రేఖా ఇంటికి వెళ్లింది.

* * *

పదకొండు కొట్టింది గడియారం.

నిద్రిస్తోన్న ప్రకాశం హఠాత్తుగా లేచాడు... చుట్టూ చీకటిగా ఉంది.

టార్చిలైటుతీసి వెలిగించాడు ... కల! తను తనగదిలోనే ఉన్నాడు! [illegible] కాదు; ఏమీ కాదు.

ఒళ్ళంతా చెమట పోసింది. వణుకుతున్నాడు.

"హత్య!"

ఔను. తాను హత్య చేశాడు. శేఖర్ని హత్య చేశాడు ... రేఖ తన ప్రిస్క్రిప్షన్ ప్రకారం మందు కలిపింది. పాయిజన్...

(53-వ పేజీ చూడండి)

స్కెచ్:

# మాంజనేయులు మస్తిష్కం

బస్సుకోసం క్యూలో నిలబడ్డాడు ఎమ్. ఆంజనేయులు. క్యూ హనుమంతుడి తోకలా అనంతంగా పెరిగిపోతున్నది. మాంజనేయులు హుషారుగా ఉన్నాడు. వందలకొలదీ మనుష్యులు ఈ విధంగా మహానగరంలో బస్సుకోసం నిరీక్షించడంలో ఎంతో మజావుంది అనుకున్నాడు. ఈ క్యూలో నిలబడిన ప్రతివొకడూ సర్వం తెలిసినవాడివలె మాట్లాడుతాడు. థియేటార్ ట్రేజెర్ గురించి ఒక పొడుగుపాటి కాలేజీ కుర్రాడు అనర్గళంగా ఉపన్యసిస్తున్నాడు. ఒక తల నెరిసిపోయిన పెద్దమనిషి యోగవాశిష్ఠంలో శ్లోకాల ప్రాశస్త్యం గురించి ఇంకో ముసలాయనతో చెప్పుతున్నాడు. నైలాన్ చీర కట్టుకున్న స్నిగ్ధతేజోవతి ఎంతో కులాసాగా తన ముందున్న లలనతో ఏదో మాట్లాడుతున్నది. బాలలు, పూర్ణయౌవనలు, ప్రౌఢలు, లోలలు - ఇంతమంది స్త్రీల మధ్య నిలబడి ఈ పుష్పకవిమానంకోసం ఎదురుచూడటం జీవితంలో ఒక వింత అనుభవం. అసలు జీవితమే ఒక అనుభవాల సేకరణ అనుకున్నాడు మాంజనేయులు.

అరగంట గడిచింది. వలభయ్యైయిదు నిమిషాలు కూడ విపోయింది. మాంజనేయులికి బస్సు దొరకలేదు. కాళ్లు పీక్కుడుతున్నాయి. దాహం వేస్తున్నది. "మండు టెండ నోటికొచ్చినట్టు పేలుతోంది" పదిగంటలకే. శరీరమంతా స్వేదమయం. ముఖం నల్లబడింది. వెధవ బస్సులూ, వెధవ చదువూ అనుకున్నాడు మాంజనేయులు. ఈ చదువు మానేసి ఇల్లరికం రమ్మని ఆయనెవడో ప్రాధేయపడుతున్నాడు. హాయిగా వెళ్ళిపోతే బాగుణ్ణు. అప్పుడే వికసించిన పుష్పంలా పదహారేళ్ళ పడుచు. నగరవాసపు కృత్రిమపుటలవాట్లువీమీ లేని ముగ్ధ. తనని సాక్షాత్తూ భగవంతుడివలె పరిగణించి పూజిస్తుందని కాబోయే అత్తగారు హామీ కూడా యిచ్చింది. గేదె పెరుగూ, పోక్కర క్షీరమూ ఇవన్నీ సేవించి ఏ గ్రంథరాజమో పుచ్చుకుని పల్లెటూరిలో అరుగుమీద కూర్చుంటే ఎంత బాగుంటుంది! అంతగా విసుగు వేసినప్పుడు బావమరదులతో చీట్లపేక ఆడుకోవచ్చు. మరదళ్ళతో సరసాలాడవచ్చు. డబ్బుకోసం ఇప్పటివలె తడుముకోవాల్సిన అవసరం లేదు. ఎంత కావలిస్తే అంతా పిల్ల నిచ్చిన మామగారు వచ్చినట్టు యిస్తాడు.

బస్సువచ్చింది కోనేటిరావులా రొప్పుతూ రోజుతూ. క్యూ నెమ్మదిగా కదిలింది. మాంజనేయులికి కూర్చోవటానికి స్థలం లేదు. కాళ్లు బాగా నొప్పెడుతున్నాయి. బస్సులో ఎవరో కాలు తొక్కారు వేలు చితికిపోయింది. వైవాహిక జీవితంలో ఒక మాధుర్యంవుంది. తన భార్యకు తనే స్వయంగా పాఠాలు చెప్తాడు. ఆమెకు

"గోపాల చక్రవర్తి"

ప్రస్తుతం తెలుగు గ్రంథాలతో మంచిపరిచయం ఉందని విన్నాడు. ఇంకేం నెమ్మదిగా ఆంగ్లభాషలోకూడ ప్రావీణ్యం వచ్చేటట్లు చేస్తాడు. మహాకవుల ఉత్తమ కావ్యాలగురించి తను చెప్తున్నపుడు శ్రీమతి కన్నులు ఆనంద పారవశ్యంతో చెమ్మగిలుతాయి. క్రమ క్రమంగా శ్రీమతి సాహిత్యంగురించి విమర్శనాపూర్వకంగా తనతో మాట్లాడగలశక్తి సంపాదించుకుంటుంది...............

బస్సు క్వీన్‌యంసీ దగ్గరకు వచ్చింది. చాలామంది అమ్మాయిలు దిగిపోయారు. మాంజనేయులికి కూర్చోటానికి స్థలం దొరికింది. 'అమ్మయ్య' అనుకున్నాడు అతను. ఎదురుగుండా అగాధమూ, అనంత తరంగజాలమూ అయిన సముద్రం. నీరధినితాంత నిరంతరనీలిమ అతన్ని ఎప్పుడూ కలవరపెట్టుంది. అందమైన సముద్రపుటలలు. జీవితం కలలమయం. నీగ్రోవనిత చెక్కిళ్లలావున్న తారురోడ్డుమీద బస్సు పయనిస్తోంది. ఈనగరంలో చదువుకోవటానికి ఉన్న అవకాశాలు అపల్లెటూళ్లో ఉండవు. ఏకకాలమందు ఒకేరచయిత వ్రాసిన ఇరవై పుస్తకాలు సంపాదించాలంటే ఇక్కడే సాధ్యమవుతుంది. ఫలానా నవల మంచిదా కాదా అనే విషయం తెలుసుకోవాలనే కుతూహలం ఉంటే, తనకంటే ఎక్కువ చదువుకున్నవాళ్లని అడగవచ్చు. తెలుసుకోవచ్చు. ఆండ్రోకిలీసు ఎండ్ ది లైన్ సినిమా వొచ్చింది మొన్న. తనూ ఒకస్నేహితుడూ పని కట్టుకుని వెళ్లి ఆసినిమా చూసివచ్చారు. ఆరాత్రీ, మర్నాడుకూడ అతను షానాటకాన్నీ, ఉపోద్ఘాతాన్ని ఎన్నోసార్లు చదివాడు. షానాటకాలకే తన జీవితాన్ని అంకితం చేసిన ఒక ప్రఖ్యాత నటుడూ, ఒక కళాశాల అధ్యాపకుడూ తనూ ఈ సినిమా బాగోగులు గంటల తరబడి చర్చించారు. ఈ అవకాశాలు తనవూళ్లో ఉండవు. కాస్త కవితాపటిమా, పాండితీమహిమా, సారస్వతాభిరుచీ ఉన్నవాడికి ఈనగరంలో ఏం చెయ్యటానికైనా వీలుంటుంది. అందులో తనలాంటి బ్రహ్మచారికీ, జీవితాన్ని చక్కగా ఉపయోగించుకోగలవాడికీ, ఈ నగరం ఇచ్చే అవకాశాలు ఎక్కువ...

బస్సు లాకాలేజీదగ్గరకు వచ్చింది. మాకుడుగా క్రిందికి దిగి పెద్దపెద్ద అంగలతో కాలేజీలో ప్రవేశించాడు. అప్పటికే విద్యార్థులంతా వచ్చేశారు. గాలరీలనిండా జనం కిటకిట లాడుతున్నారు.

ఒక ఏభైమందితోసహా వరండాలో నిలబడాల్సి వొచ్చింది. లెక్చరర్ క్లాసులోకి వచ్చాడు. ఇన్ని వందల మంది పేర్లు పిలచి అటెండెన్సు తీసుకోవటం ఒక యజ్ఞం చేసినంతి పని. ఇది ఒక సహస్రనామార్చన. తర్వాత లెక్చరర్ ఉపన్యాసం ఆరంభించాడు. ఒక్టే ఊకదంపుడు. విద్యార్థులు నవ్వుతున్నారు ఈలలు వేస్తున్నారు. పాటలు పాడుతున్నారు. ఎండ తీవ్రంగా ఉపన్యసిస్తోంది, శ్రీశ్రీ చెప్పినట్లుగా. మాంజనేయులికి మళ్ళీ కాళ్ళనొప్పులు ఆరంభమయింది.

చచ్చు విద్యార్థులూ, చచ్చు పరీక్షలూ ఎందుకొచ్చిన గొడవ ఇది అనుకున్నాడు. కాబోయే మామగారూ, భార్యా కళ్ళ



ముందు కన్పిస్తున్నారు. పిల్లలు ఉన్న ఇల్లు నుండే కళవేరు. వాళ్ళ కబుర్లు వింటూ వుంటే ఇంకేమీ అక్కరలేదు. వాళ్ళు పెరిగి పెద్దవాళ్లయి తనకు సహాయపడతారు. మనుమలతో, మునిమనమలతో తనగృహం స్వర్గధామంలా ఉంటుంది. ఈ చదువెందుకు అనుకున్నాడు మళ్ళీ. ఈలా కోర్సు అయినతరువాత మాత్రం తన భవిష్యత్తు బాగుంటుందని అనుకోవట మెట్లా? ఉద్యోగ సమస్య అప్పుడు మళ్ళీ తలెత్తుతుంది. కొందరి ఉద్యోగసమస్యలు కాశ్మీర్ సమస్యలా ఎప్పటికీ పరిష్కారం కావు. పోనీ ప్రాక్టీసు పెడ్తే! అబ్బే బోర్డు కట్టిన అయిదేళ్లవరకూ దమ్మిడీ రాదురా భాయ్ అన్నాడు మొన్న ఒక న్యాయవాది మిత్రుడు. ప్రతివాడూ అల్లాడి కృష్ణస్వామీ, తేజ్ బహదూర్ సప్రూ అంతటివాడవుతాడా. డౌన్ విత్ లాకాలేజ్. నువ్వొక నిరాశావాదివి అంటాడు సోమయాజులు. డబ్బుంటే తనూ ఆశావాదే.........

క్లాసు ఐపోయింది. తను వరండాలో నడుస్తున్నాడు. 'హల్లో మిస్టర్ ఆంజనేయులూ అని పలకరించింది స్నేహితురాలు చంద్ర. హలో హవ్ డు యూ డూ అన్నాడు తను. "నాకు చాలా ఆకలిగా వుంది. లంచ్ హోమ్‌లో టిఫినుతిందాంరండి" అంది చంద్ర. ఇద్దరూ నడుస్తున్నారు. మాంజనేయులికి చాలా గర్వంగా వుంది; ఇంతమంది అబ్బాయిల మధ్య ఒక అందమైన స్త్రీతో ఈవిధంగా నడవటం. ఒక స్త్రీని పట్టుకుని ఆమెమీద ప్రేమను జీవితంలో అన్ని విలువలకంటె ఎక్కువచేసుకుని సర్వప్రపంచాన్నీ ఆమెకోసం వొదులుకోగల ధైర్యంతో ఆమెను కోరడం జీవితంలో ఒక పెద్ద అనుభవం. ఈలేత యవ్వనంలో ఈ ఆడవాళ్లు నాకంలో అప్సరసలకంటె అందంగా కన్పించి ఏవేవో భావాలు కలిగించి నరాలలో వేడిపుట్టించి రాత్రిళ్లు నిద్ర పట్టకుండా చేస్తారు. ఆ సురారి ఘనమద ధనుస్సుబోలిన చంద్రదేహం. చంద్ర ఎర్రని పెదవులూ, మెరిసే చంపలూ అతనికి మత్తు కల్గిస్తున్నాయి. ఆ చీరలో మిస్టరీ తలుచుకుంటూవుంటే మాటలు తడబడుతున్నాయి. "చంద్రా ఇటు వొకసారి చూడు. నీవు లేని నా హృదయము వల్లకాడు" అన్నాడు. చంద్ర కిలకిల నవ్వి "యూ నాటీ బోయ్"అంది. ఆమాటలు అతనికి ద్రాక్షారసంలా వున్నాయి. "అవును. నీకోసమైనా ఈ కాలేజీలో వుండిపోతా. నువ్వెన్నాళ్ళు ఈ కాలేజీలో వుంటే అంతకాలం ఇక్కడే వుంటాను." అనుకున్నాడు.

మళ్ళీ మర్నాడు బస్సుకోసం రెండు గంటలు నిలబడి కాళ్ళు నొప్పులు పుట్టే వరకూ మాంజనేయులికి ఈ అభిప్రాయం మారదు. ★

---

## సవరణ

5-8-53 సంచికలో, 38 వ పేజీలో, "దీర్ఘాయువు" అనే కథ మొదటి పేరాలో, "దేవదత్తుడనే ఆయన దానికి రాజు" అని పొరపాటున ముద్రింప బడినది. "బ్రహ్మదత్తుడనే ఆయన..." అని చదువుకో వలెనని ప్రార్థన.

---

ఒకరు:- "ఏరా, భాయ్, ఆంధ్ర రాజధాని మార్చేస్తారట?"

రెండవవారు:- "ఔనట"

ఒకరు:-"ఎక్కడ నుంచి?"

రెండవ:- "అదేమో!"

ఒకరు:- "ఎక్కడికి?"

రెండు:- "అదీ తెలియదు!"

శ్రీ క. సత్యనారాయణ, విజయనగరం.

---

తండ్రి: ఏరా! ఇంత రాత్రప్పుడు వుత్తరం పోస్టు చేస్తున్నావు?

కొడుకు: దీనికి స్టాంపులేదు పగలయితే ఎవరన్నా చూస్తారని ఇప్పుడు పోస్టు చేస్తున్నా! నాన్నా!

బి. సుబ్బారావు, విజయవాడ.

# ముగ్గురు స్త్రీలు

ముగ్గురు స్త్రీలు ఒక రైలుదారిన బడి నడుస్తున్నారు. వాళ్లు ఏ జాతికి చెందినవారో, ఆ రైలుదారి ఏ ప్రాంతాన వున్నదో, ప్రస్తుత కథ కనవసరం.

వాళ్లు ముగ్గురూ స్త్రీలన్న మాట వాస్తవం!

ఒక స్త్రీ బిచ్చపుది. ఒంటిమీద చింకి గుడ్డలు ముఖమంతా దుమ్ము పేరుకొనివుంది. జుట్టు జిబ్బి జిబ్బిగా వుంది. దిసికాళ్ళు పుళ్ళుపోయి, అరికాళ్ళల్లో రాళ్లు గుచ్చుకొని, చిల్లులు పడ్డట్టున్నయ్.

మరొక స్త్రీ ఇరవైయేళ్ళ యౌవన ప్రాయంలో వుంది. కళ్ళల్లో వెలుగు వ్యక్తమవుతూంది. వక్షోజాల వంపుల్లో యౌవనం బయటికి తొంగిచూస్తోంది. ఆమె నడుస్తూంటే, ఆలోచనలేని అలక్ష్యం గోచరం అవుతూంది.

ఇంకొక స్త్రీ గర్వంతో కూడుకొన్న మాతృశ్రీ. ఆమె చేతుల్లో నెల రోజుల క్రింద పుట్టిన పసికందు ఆడుకొంటున్నాడు. మాటిమాటి కామె కళ్లు చింకి గుడ్డల్లోంచి తొంగిచూస్తున్న ఆ పసికందు ఎట్టిని ముఖంమీదే కేంద్రీకరించబడుతున్నాయ్.

ఆ ముగ్గురుస్త్రీలు నిశ్శబ్దంగా నడుస్తున్నారు. వస్తూన్న రైలుబండి కూత అకస్మికంగా వాళ్ళ చెవుల్లో బడగానే తలలు కొంచెం పైకెత్తి చూచారు. దూరంగా రైల్వే సమానాంతర కమ్మీలు సన్నని వేలులాగ కలిసినచోట, నీలిరంగుగల పొగ తాలూకు చారలు కనబడుతున్నాయ్.

రచన: కె. ఎ. అబ్బాస్

అనువాదం: 'త్రాసిరా'

'రెండు నిమిషాల్లో, ఆ రైలుబండి ఇక్కడకు వచ్చేస్తుంది.' గొణిగింది, బిచ్చపుది.

మిగత యిద్దరకూ, ఈ మాటల్లో ప్రమాదాన్ని సూచించే అర్థం గోచరించింది. ఏదో సంభ్రమంలో వున్నట్లు, 'ఏమిటి? ఏమన్నావు?' అన్నారు.

'దాని అర్థం మీకు తెలుసుగా.' బిచ్చపుది సమాధానంగా అన్నది. ఆమె దృష్టి ఇంకా రైలుకమ్మీలమీదే వున్నది. ఇంజను అనే ఆ చిన్న నల్లమచ్చ క్రమంగా పెద్దదవుతూంది. 'ఆ బండి గనక మనమీదుగా వెళ్ళిందంటే మన సమస్యలన్నీ తీరిపోతాయ్.'

'ఊహూ, నాకు చావాలని లేదు. నేను పడుచుదాన్ని. జీవితాన్ని ఎంతో గాచి చూడాల్సి వుంది.' పడుచుస్త్రీ అన్నది.

'నీ పడుచుదనంవల్ల ఏం లాభం? మగవానికి కీలుబొమ్మ అవడానికే గదు. అవసరం తీరాక, పాత జోళ్లు పారేసినట్లు, నిన్ను అవతల పారేస్తాడు.'

'లేదు, లేదు. అతి స్నేహమీ అనమాకు. అతను నన్నెంతో ప్రేమించాడు. తలిదండ్రులు ఒప్పుకోకపోతే, అతనేం చేస్తాడు, పాపం!'

'ఆ ప్రేమనే నమ్ముకుంటూ వుండు; బాగా తెలిసివస్తుంది. ఆ ప్రేమ గొప్పతనాని మాటలవల్లే, మగవాళ్లు, నీవంటి వాళ్లను వలలో చిక్కించుకొంటున్నారు! పడుచుదనంలో నీ శరీరాన్ని......నీ మానాన్ని అమ్ముకొంటే, ఏమన్నా రెండు రాగిపైసలు దొరుకుతాయ్. అంతేగా. ఎందుకో బ్రతుకు బ్రతికి.' బిచ్చపుదాని కళ్ళు ఉద్వేగపూరితాలయినాయ్. 'చివరకు ఎందుకు కొఱగాని ముసలి తొక్కవవుతావు. అప్పుడు నీ ముఖం ఎవరు చూస్తారు?'

'పడుచుదనంలోనే వుంది ఆనందం' మెల్లిగా అన్నది, ఆ పడుచుస్త్రీ. కాని ఆమె ఆశలు, ఆమెలోనే బిచ్చపుదాని దుడుకుమాటల కొరడాగా, సడలిపో నారంభించాయ్.

ఈదఫా, బిచ్చపుది మాతృశ్రీవంక చూచి 'నీవమ్మా, నీవు. చావంటే నీకు గూడ భయమేనా?' అడిగింది.

'అంగా అనమాకు.' పసికందును మరింత వక్షోజాలకు అదుముకొంటూ అంది, మాతృశ్రీ. 'నాకూ చావాలని లేదు. నా పసికందుకోసం అన్నా బ్రతకాలి.'

'అంహా. ఆ మాంసం ముద్ద! నిన్ను పీల్చి పిప్పిచేసే ఆ పసికందు, ఈ ప్రపంచంలోని అవినీతివల్ల జనించిన ఆ పసికందు గురించి ఎందుకూ!' అలక్ష్యంగా అన్నది, బిచ్చపుది.

---

పాలు, వెన్న, నెయ్యి వీటిని గురించి పంతులుగారు గుక్క ఆపకుండా చెప్పుకుపోతున్నారు, రెండవ తరగతి క్లాసులో పిల్లలు శ్రద్ధగా వింటున్నట్టు కనిపించలేదు. చివరి బెంచీలో రాము, వేణూ చుక్కలాట లాడుతున్నారు; పంతులుగారు వీళ్లిద్దర్నీ చూచారు. కోపంగా వేణూ! అని కేకవేశారు. వేణు భయంతో వణికిపోతూ లేచి నుంచున్నాడు.

"నువ్వు పాఠం వింటున్నావా?

"వింటున్నానండి...!

"అయితే దీనికి జవాబు చెప్పు. నెయ్యి ఎండలో పెడితే ఏమౌతుంది? వేణు తడుముకోకుండా జవాబిచ్చాడు.

"కుక్క నాకేస్తుందండి"...

—శ్రీ గోపాలరావు, కాకినాడ.



'సరే, దాన్నిగురించి నాకు తెలుసు. ఏమయినా వీడు నావాడు, నా బిడ్డ - నా రక్తం పంచుకొన్నవాడు!'

'అంహా, ఎందుకు నన్ను ఈ వేదాంతంతో చంపుతావు. గాలివాన వీచిన అర్ధరాత్రి, నిన్ను మీ అమ్మావాళ్ళు బయటికి తరిమిననాడు, ఇట్లాగా అనుకొన్నారా, వాళ్ళు? వాళ్ళ రక్తం పంచుకొన్న దానివే గదా, మరి!'

'అది గాదు సంగతి. నే చావటంగురించి నేను చూడటంలేదు. అందుకు తగ్గదాన్నే, గూడా. ఈ దరిద్రజీవితం ఎట్లాయినా ఎళ్ళ మారిపోవాల్సిందే. కాని ఈ దిక్కులేని పసికందు గతేమవుతుంది. నేను చచ్చిపోతే దీన్నెవరు చూస్తారు?'

'అందుకనే, ఆపసికందుని గూడ, నీతో పాటు చంపేసెయ్. ప్రపంచంలో ఇంకో బిచ్చగాడు తక్కువవుతాడు. అంతే! అయినా నీవా పసికందును బ్రతికించి, పెద్దవాణ్ణి చేస్తే, అతనికేం భవిష్యత్తున్నది, గనుక.'

మాతృశ్రీ తనబిడ్డవిషయమై బిచ్చపుదాంతో కాసేపు వాదించింది. బిచ్చపుది ఏదోస్థిరాభిప్రాయానికి వచ్చింది. క్షణం ముందు అంతదూరంలో, ఇంజను నల్ల మబ్బులాగ వున్నదల్లా, పెద్దగా కూస్తూ, పెను భూతం లాగా దగ్గిర పడుతూంది.

'సరే', చివరకు నేనే చావటానికి వెళుతున్నా, నాకెవరూ లేరు. వారి కోసం బ్రతకాలనుకున్నా.

బిచ్చపుది తన స్థిరాభిప్రాయాన్ని వెలిబుచ్చింది.

'నీకు పిచ్చెక్కింది!' అరిచారు, మిగత యిద్దరూ.

'హాఁ హాఁ' బిచ్చపుది వికృతంగా నవ్వుతూంది. అనుకోండి నాకు పిచ్చే ఎక్కిందని. మీ సంగతి నాకు తెలుసు—మీరు పిరికిపందలు, పడుచుదనం, తల్లిప్రేమ అనేవాటి వెనక మీపిరికిదనాన్ని దాచుకొంటున్నారు! పిచ్చెక్కింది మీకే. సరే. శెలవు!

'నీవులేంది మేమెట్లా బ్రతికేది. నీవు చస్తే, మేమూ చస్తాం!' పడుచుస్త్రీ మాతృశ్రీ అరిచారు. తమ మిత్రురాల్ని వెనక్కులాక్కురావాలని ప్రయత్నిస్తూ.

రైలుబండి ఇంకా కొన్ని గజాలదూరంలోనే వుంది. బిచ్చపుది రైలుకమ్మీల మీద పడిపోగానే, ఇంజను కూత వేసింది. డ్రైవరు బ్రేకులు బలంగా వేశాడు. కాని ఆపని ఆలస్యంగా జరిగింది.

దయ్యంలాగ వున్న ఆ ఇంజను కొంచెం వెనక్కువెళ్ళి ఆగింది. ఇంకా పనివారు, చక్రాలక్రింద బడ్డ మనుష్యుల ఎముకలు, మాంసంకండలు బయటక లాగారు. కొంతసేపట్లో, రైలుబండిలోవున్న పాసెంజర్లు అక్కడ గుమికూడారు.

'ఆమె ఎవరో బిచ్చపుది' అన్నాడెవరో.

'ఎవరో పడుచుపిల్ల, పాపం. పైగా అందంగావుంది, గూడా!' అన్నారు మరొకతను.

మూడోతను 'అయ్యో, పాపం, పసికందుతో చనిపోయిందే. ఈ తల్లి ఎవరో!' అన్నాడు.

'ఒక స్త్రీ చనిపోయింది.' అక్కడికి అప్పుడే వచ్చిన ఎవరికో ఆగుంపులో వున్న ఒకతను జరిగిన సంఘటనగురించి చెప్పేశాడు.

కాని, ఆగుంపులోవున్న ఒక శిలాపథర్–అతని కళ్ళు అందరి కళ్ళకన్న ఎక్కువ గమనశక్తిని కలిగుంటాయ్ గనుక - అవాణి అన్న మనిషిని పరిదర్శిస్తూ.

'ఒక్క స్త్రీ గాదు, చనిపోయింది, ఇద్దరు స్త్రీలు' అన్నాడు. ★

సీరియల్ నాటకం:




## మూడో అంకం

రంగం: అదే.

సమయం: రెండు నిముషాల తర్వాత.

తుఫాను పూర్తిగా తగ్గిపోయింది. ప్రకృతి అంతా నిస్తబ్దత వహించింది. హాల్లో లైట్లన్నీ వేసివుంటాయి. క్రిందపడివున్న నారాయణ పక్కనే మోకరిల్లి పరీక్షిస్తూంటాడు రాజారావు మనిషి చచ్చిపోయాడని అర్థమయింది...పడమటింటి తలుపు బాదుతారెవరో. రాజారావు త్వరత్వరగా వెళ్ళి తలుపు తీస్తాడు. రామానుజం, నరహరి వస్తారు.

రామా: ఏమిటది? ఏం జరిగింది? ఎక్కడిదా పాటు?

రాజా: (కంగారుగా) నారాయణ— (శవంకేసి చూపుతాడు).

నర: గుడ్ గాడ్!

[రాజా, రామానుజం శవంకేసి వెళ్తారు. నరహరి వెంటనే భోజనాలగది తలుపు గడియ చప్పుడు కాకుండా వేసేస్తాడు.]

నర: (శవం దగ్గరకు వెళ్ళి ఒక్కక్షణం ఆగి) ఆడవాళ్ళంతా కూడా వస్తున్నట్టున్నారు. మీరా గడియ వెయ్యండి రామానుజంగారూ. ఇది చూశారంటే వాళ్ళ ప్రాణాలు పైనే పోతై

[రామానుజం పడమటింటి గడియవేసి వస్తాడు.]

రామా: ఎలా వచ్చిందీ శవం ఇక్కడికి?

రాజా: నా గదిలో నే వున్నాను ఇంతలో రివాల్వరు పాటు వినిపించింది.

నర: ఇంకెవరైనా వున్నారా యింతకు ముందిక్కడ?

రాజా: వుండేవుండాలెవరో మరి—

రామా: అవును. లేకపోతే ఎలా వస్తారాయన, తాళంవేసిన గదిలోంచి ఇవతలికి?

నర: ఆ వరండా తలుపు చూడండి రామానుజంగారూ. అది తీసివుంటే ఆ వాకిలిగుండా వెళ్ళిపోయి వుంటాడన్నమాట!

రామా: (చూసి) లేదు. ఇది గడియ వేసి వుంది—ఇటుపక్కనే

నర: (భోజనాల గది చూపిస్తూ) అది?

[ఇంతలో ఎవరో భోజనాలగది తలుపు తట్టుతారు]

ఎవరో చూడండి.

రామా: (వెళ్ళి) ఇదికూడా వేసేవుంది ఇవతలపక్కనే గడియ.

[తలుపు తీస్తాడు. వెంకన్న వస్తాడు.]

వెంక: ఏం బాబూ-ఏమన్నా ప్రమాదం.. పిస్తోలు పేలినట్టనిపించిందీ—

రామా (బెదురుతో రాజావంక చూస్తూ, నరహరితో) ఇప్పుడేదో ఒకటి చెయ్యాలండీ మరి.

రాజా: ఏదో చెయ్యండి మరి చప్పున. షూట్ చేసిం దెవరో చూడండి.

రామా: (టేబిలుమీద పిస్తలు చూచి) అదుగో రివాల్వరు!. (కాని ముట్టుకోడు)

నర. అది నాదగ్గరుంచుతా లెండి.

[రివాల్వరు తీసుకుని జేబులో పెడతాడు]

రామా: షూట్ చేసింది ఎవరో నా?. నువ్వేగా!

రాజా: నేనా! యు డామ్ ఫూల్! నీకు మతిగాని పోతూందా?

రామా: ఇంక మీ జిత్తులు కట్టిపెట్టండి రాజారావుగారు ఇందాక మీయంతట మీరే! ఒప్పుకున్నారుకూడానూ!

రాజా: ఒప్పుకు—(పరిస్థితి అర్థం ఛట్టునస్ఫురించి) హరిదేముడా! అదంతా వుత్త తమాషా అయ్యాబాబూ!

రామా: తమాషా!....అదెదో తెలుస్తుందిలే కోర్టులో శిక్షపడినప్పుడు.

[ఇంతవరకూ రాజా ముఖం చాలా పరిశీలనగా చూస్తున్న నరహరి, అతను తనవంక చూడగానే దృష్టి తప్పించి శవందగ్గర కొస్తాడు]

నర: ఇదుగో - కొస్త సాయంపట్టండి రామానుజంగారూ!

రామా: (అదిరిపడి) ఏమిటి? ఏం చెయ్యాలని?

నర: ఆగదిలోకి తీసుకువెళ్దాం.

రామా: ఎందుకూ పోలీసులు వచ్చేదాకా? ఇక్కణ్ణించి కదిలించడం మ[illegible] కాదేమో

నర: వాళ్ళ దుంపతెంచుకుని ఎప్పుడొస్తారో, రద్దురూ.

రామా: నావల్లకాదు బాబూ.

నర: ఓ-భయం వేస్తోందా! సరే—

[నరహరి వెంకన్న వంక చూస్తాడు. వెంకన్న రాజావంక చూస్తాడు నే సాయం పట్టనా అన్నట్టు. రాజారావు, విచారభారంతో తలవూపుతాడు]

వెంక: (నరహరితో) నేపడతా బాబూ సాయం...

[ఇద్దరూ కలిసి శవాన్ని లేవదీస్తారు.]

నర: (రామానుజంతో) కొస్త ఆ తలుపు తెరవండి - మీకు భయం లేకపోతేనే లెండి.

[శవాన్ని పడమటింటిలోకి తీసుకెళ్తారు. రాజా అటే చూస్తూంటాడు. భోజనాల తలుపుతోసుకుని మోహన్ వస్తాడు]

మో: రాజా! ఓ నువ్వు కులాసాగానే వున్నావుగదా! థాంక్ గాడ్... ఏమిటి-

రివాల్వరేదో పేలినట్టుంది?

సుకు : (వచ్చి) ఏంరా మోహన్ - ఏం జరిగింది?...మళ్ళీ పిస్టలు పేలినట్టుంది?...

రామా : ఆఁ - చూడండి మోహనరావు గారూ! మీ సాయంకూడా కావాలి పోలీసు లిక్కడికి వచ్చేదాకా, కొస్త దిట్టమైన నిఘాలో వుంచాలి రాజారావుగార్ని!

సుకు : (రాజాని చూసి) ఓహ్ - ఈయన్నెవరు వొదిలించారు లాకప్‌లోంచి?

రామా : అవును. ఎవరొదిలించారు? అదీ తేలాలి. ముందు పోలీసుల్ని తెప్పించాలి మనం.

[వెంకన్న నెమ్మదిగా షో లోకి జారుకుంటాడు.]

మో : ఐతే వీరురుమటుకు మానుకోరన్నమాట లేనిపోని పెత్తనాలు నెత్తిన వేసుకోడం!

రామా : ఏమిటండీ లేనిపోనిది? *Law and Order* నిలబెడదామని చూస్తున్నాన్నేనిక్కడ చేసి తీరాల్సిన కనీస ధర్మం కదంఅది ప్రతిడీ మానవుడూనూ!

మో : సరే చెయ్యండి. నేమటుకు పోను.

రామా : పోనీ మీరైనా సరే సుకుమార్జీ?

సుకు: నావల్లకాదు బాబూ. ఆ లాంచీని నే నొక్కణ్ణీ నడపలేను.

రామా : నేను కూడా వస్తాను పోనీ మీతో. మీరెళ్ళి లాంచీని సిద్ధం చెయ్యండి.

మో : రాజారావు అనుమతి లేందే అతని లాంచీ ముట్టుకోవడాని కెవరికీ అధికారం లేదు.

రాజా : (సోఫాలో కూర్చొబడుతూ) వెళ్ళిరానీ మోహన్. ఆ పోలీసు లెంత తొందరగావస్తే అంత మంచిది మనందరికీ కూడానూ!

[సుకుమార్ వరండాలోంచి వెళ్తాడు లోపల కొస్తున్న నళినికి దారి యిచ్చి.

భోజనాల గదిలోంచి కమల వస్తుంది. ముఖం చాలా వివర్ణంగా ఆందోళనతో కనిపిస్తుంది.]

నర: (ఎదురు పోయి) నువ్వెందుక్కమలా వచ్చావ్? పోయి పడుకో ఇక్కడ పరిస్థితులేం బాగులేదు.

కమల: మరేం ఫరవాలేదు (అతన్ని తప్పించుకుని సోఫాలో కూర్చుంటుంది.)

రామా: నిజమే. (నళినితో) ఆడవాళ్ళంతా కొస్త అవతలవుంటే మంచిది.

నళిని : రాజా—

రాజా : వద్దు నళినీ. నువ్విక్కడ వుండరాదు వెళ్ళిపో - నామాట విను.

నళిని : ఇంకా వాళ్ళకి చెప్పలేదా?

రాజా : నేను - అది కాదు నళినీ - నేను...

నళిని : అదికాదు లేదు; గిదికాదు లేదు. నువ్వు చెప్పకపోతే నే చెప్పేస్తాను. ఇంతవరకూ చేసిన తమాషాచాలు.

నర : తమాషా యేమిటి?

నళిని : అవును! ఏదో జరిగిందని మీర నుకుంటూన్నదంతా వుత్త తమాషా!

కమల : ఏమిటే-ఉత్తతమాషా? అంటే-నారాయణ బ్రతికేవున్నాడా? ఏమండీ-

నళిని : అవును, వచ్చిన దగ్గర్నుంచీ

# ★ కాళరాత్రి ★

ఎంతసేపూ హంతకులూ హత్యలూ డిటెక్టివ్ నావెల్సూ. వీటిని గురించేగా మనం మాట్లాడుకోవటం! అందుకని నారాయణా మా రాజా కలిసి మనల్ని ఉత్తినే భయపెట్టడానికి ఓ చిన్న నాటకం ఆడదామనుకున్నారు. అదంతా వుత్తతమాషా యేనండీ, రాజావచ్చి మీదగ్గర నారాయణ్ణి తనే హత్యచేశానన్నదీ అదీ—

రామా : కళ్ళారా చూసింది నేనూ ఆ శవాన్ని, నరహరిగారు కూడా చూశారు. (నరహరితో) ఏమండీ?

నళిని : అది శవం కాదు—చొక్కా లాగూ తొడిగిన దిళ్లని బొమ్మ !—

రాజా : వద్దు నళినీ - నువ్వనవసరంగా శ్రమపడకు... నారాయణ చచ్చిపోయాడు!

రామా : ఏమిటీ మీరనేది?

నళిని : (నిస్సహాయంగా) అవునండీ బాబూ - నామాట నమ్మండి. నారాయణ ఎక్కడో దాక్కొనివున్నాడు - బ్రతికే వుంటాడే!

నళిని : అబ్బ - ఇక చాలు ఆపు రాజా నీనాటకం.

రాజా : నాటకమే అయితే ఎంతైనా బాగుండేది నళినీ! నిజంగా నారాయణ్ణి ఎవరో షూట్ చేసి చంపేశారు.

నర : అవును. గుండెల్లో రివాల్వరు గుండు దెబ్బతిని శాశ్వత నిద్రపోతూ ప్రక్కగదిలోనే వున్నాడిప్పుడు.

[కమల దుఃఖంపట్టలేక మొహం చేతుల్తో కప్పుకుని వెక్కి వెక్కి ఏడుస్తూంటుంది. నరహరి దగ్గరకు వెళ్ళి సముదాయించబోతాడు]

నళిని : (ఒకక్షణం నిశ్శబ్దరాలై) ఎలా జరిగిందది?

రాజా : తెలీదు.

నళిని : ఎవరు చంపారసలు ?

రాజా : అదీ తెలీదు...అయినా నువ్వీ విషయంలో జోక్యం కలిగించుకోకు నళినీ.

నళిని : కలిగించుకోకపోతే అసలు హంతకుడెవరో తెలుసుకోవటం ఎలా?

రాజా : పోలీసు లొచ్చినతర్వాత కావలసినంత తెలుసుకోవచ్చు.

నళిని : అప్పటికి పరిస్థితులు విషమిస్తై. ఆహత్య చేసిందెవరో ఇప్పుడే కనిపెట్టాలి-పోలీసులు రాకముందే!

రామా . అర్థం కావటం లేదు మీ ఉద్దేశం నళినీ దేవిగారూ! ప్రత్యేకం చెప్పాడు నాతో హత్యాకాండ ప్రారంభిస్తానని. వూరుకున్నా నేను ఏదో వేళాకోళంలే అని.

ఇక్కడే వున్నాం మనందరం. ఆ వరండా, అవతల రివాల్వరు పేలినప్పుడు వెంటనే లోపలకు వచ్చిన రాజారావు తనే నారాయణని హత్య చేసినట్టు అందరియెదుటా ఒప్పుకున్నాడు. ఇంతకంటే ఇంకేం కావాలి సాక్ష్యం ఎవడైనా గానీ వురికంబం ఎక్కించడానికి ?

కమల : (దుఃఖావేగంతోనే) జరిగిన హత్య చాలదూ? దానికితోడు మరో ప్రాణంకూడా బలి కావాలా ? ఎందుకు మీకింత రక్త పిపాస? అబ్బబ్బ.

నర : కమలా !

[సుకుమార్ కంగారుగా వస్తాడు.]

రామా : ఏమండీ రెడీయేనా లాంచీ?

సుకు : లేదు.

రామా : ఎందుకని ?

సుకు : ఇంజను తాళం చేతుల్లేవు.

రామా : ఏమైనయ్ !

సుకు : ఏమో- ఎవళ్ళో దాచేసివుంటారు.

రామా : ఏం రాజారావుగారూ - ఎక్కడ వున్నయ్ తాళం చేతులు?

రాజా : నాకు లేనిపోని తెలివితేటలన్నీ అంటగడుతున్నారు రామానుజంగారూ మీరు !

రామా : (అందరి ముఖాలవంకా ఒకసారి చూసి) అవరోధం కలిగిస్తున్నారెవరో న్యాయానికిక్కడ. పోలీసులికి రిపోర్టు చేస్తా నీ విషయం.

సుకు : నే నిహ ఇక్కడ క్షణంకూడా వుండను. (వెళ్ళబోతాడు.)

నళిని : ఆగండి—ఆ-గం-డి !

[సుకుమార్ ఆగిపోతాడు.]

నళిని : (అందరితోనూ) మీగోల కాస్త ఆపి నే చెప్పేది వినిపించుకోండీ!...రాజా నిర్దోషి ! అతనుకాదీ హత్య చేసింది ! కాని అతనే దోషి అనే దృఢాభిప్రాయంతో మనం పోలీసుల ప్రశ్నలకు జవాబిచ్చామా, ఆయన కింక ఛాన్సు వుండదు. కనక వాళ్లు రాకముందే మనలో మనం—

రామా : గూడుపుఠాణీచేసి, అబద్ధమాడి న్యాయానికి అవరోధం కల్పించి అన్యాయానికి తోడ్పడమనా మీరు చెప్పేది ?

నళిని: అన్యాయం జరక్కుండా వుండాలనే నా ప్రయత్నం!...అన్నెం పున్నెం ఎఱుగని అమాయకుడొకడు నిష్కారణంగా ఉరితియ్యబడుతూంటే చూస్తూ వూరుకుంటాగా ?

రామా : అన్నెం పున్నెం ఎరగని అమాయకుడు !

రాజా : మీకది వెటకారంగా కనిపిస్తోందంటే నాకేమంత ఆశ్చర్యంగా లేదులెండి. అయినా అందుకు మిమ్మల్ననాల్సిన పనేం లేదు. కాని - (అందరివంకా చూస్తూ) నేను నిజం చెప్తున్నాను - నారాయణ్ణి హత్యచేసింది నేనుమటుక్కాదు...మీలో అధమం ఎవరో ఒక్కరికైనా తెలుసు నేను నిర్దోషినన్న విషయం !

[వెంకన్న భోజనాల గదిలోంచి వచ్చి తలుపుదగ్గరే నిలబడతాడు]

రాజా : (ఏదో తట్టి రామానుజంతో) చూడండి రామానుజంగారూ! నదిలో కొట్టుకుపోయిన నారాయణ శవం ఇక్కడికెలా వచ్చిందంటారు?

రామా : (రాజాతో) ఏం? వెంకన్నని వెళ్ళమన్నానుగా వెదకడానికి! మోసుకొచ్చాడేమో ఏదుబ్బుల్లో నన్నా వుంటే చూసి!

వెంక : నేనేం తీసుకురాలేదు బాబూ.

రామా : ఐతే మోసుకొచ్చింది రాజా రావుగారే అయివుండాలి !

రాజా : నేనా?.....నే నా?......నే నెందుకు తెస్తాన్నా, నువ్వు, నీ... (బ్రహ్మాండంగా వచ్చిన కోపాన్ని అప హాస్యన్ని దిగమింగుకుని) పోనీ, నరహరీ! నువ్వు శవాన్ని ముట్టుకునికూడా చూశావు గదా - నదిలోపడి తడిసిన శవమన్నా కనిపించిందా?

నర : (ఉలిక్కిపడి త్వరలోనే సర్దుకుని) ఆఁ - అఁహాఁ లేదు. తడిసినట్టేం లేదు.

మో : దీనికేం చెప్తారు రామానుజం గారు?

సుకు : మరి - ఇంతకుముందు వినిపించిన పాటెక్కడిది? అదెవరు పేల్చారు?

రామా : ఇంకెవరు? రాజా రావుగారే నన్న మాట!

రాజా : ఎందుకు పేల్చానో కూడా కాస్త శెలవిస్తారా దయచేసి?

రామా : మొట్టమొదట్లో మీరు నారాయణని షూట్ చేసి చంపిన మాట సత్యం ! అది వుత్త తమాషా అని నమ్మించడానికి నదిలో పారేసివుంటారో జష్టి బొమ్మని, కాని హత్య చేసింది మీరేనని ఒప్పుకున్నారు వొళ్లు తెలియని ఆవేశంలో. ఒళ్ళు తెలిసినవెంటనే పశ్చాత్తాప బడ్డారు, ఎందుకొప్పుకున్నానా అని ! ఆలోచించారు, ఎలా తప్పించుకోవడమా అని. పన్నేరు మరోపన్నాగం. దాచి పెట్టిన నారాయణశవాన్ని ఇక్కడ తెచ్చి పడేసి, గాలిలోకి పేల్చారు రివాల్వరు. అందరూ రాగానే బుడి బుడి దుఃఖాల నభినయిస్తూ 'నేచేసింది తమాషా, ఇంకెవరో చంపి పోయారు నిజంగానే' అని మొదలెట్టారు.

నర : తలుపులన్నీ లోపలే గడియలు వేసి వున్నయ్ కూడానూ.

రామా : అవును. అక్కడే వేసిందియన పప్పులో కాలు ! ఏ ఒక్క తలుపు తీసి వుంచినా, హంతకుడు ఎటో పారిపోయాడని అనుకునేవాళ్ళం మనం.

నళిని : రాజా ! ఆ పాటు పేలినప్పుడు నువ్వెక్కడున్నావ్ ?

రాజా : నా గదిలోనే! అప్పటిదాకా ఆ తమాషా సంగతే మాట్లాడుతూ కూర్చున్నాం, నేనూ నారాయణానూ. అతన్ని వదిలేసి నా గదిలోకి వెళ్ళిపోయాను. ఐదు నిముషా లయిందో లేదో రివాల్వరుపాటు వినిపించింది. వచ్చి చూస్తే అంతా చీకటి! లైటు వెయ్యంగానే కనిపించాడు చచ్చి పడివున్న నారాయణ.

రామా : మరెవరూ లేరుగదా ?

రాజా : లేరు.

నర : పోనీ ఎవరైనా పారిపోయిన చిహ్నాలు ?

రాజా : అవీ్వ నాక్కనిపించలేదు.

రామా : (వెటకారంగా) పోనీ ఈ గదిలో బిలమార్గాలూ - మీట తలుపులూ వున్నాయా ?

సుకు : ఓహో - నే చెప్పలా. ఇందాక చూడండయ్యా బాబూ వాటికోసం అని ?

రాజా : (రామానుజంతో) మా నాన్న గారీ యిల్లు కట్టించేసరికి నీ పుస్తకాలేం చదవలేదాయన.

రామా: రివాల్వరు పాటు వినిపించగానే పరుగెత్తుకొచ్చాం నేనూ నరహరిగారూ... అంతే గదండీ - మనిద్దరమే కదూ ?

నర : అవును. మనమే ముందొచ్చింది.

రామా : మేం వచ్చేసరికి ఈ గదిలో వున్నదల్లా సజీవంగా రాజారావుగారూ - నిర్జీవంగా నారాయణా ! రాజారావుగారు తన గదిలోకి వెళ్లినప్పుడు కూడా తీసుకెళ్లారు రివాల్వరు. అదే రివాల్వరు మేం వచ్చేసరికి ఆ మేజామీదవుంది. తలుపులన్నీ ఇటు పక్క గడియలు వేసేవున్నయ్. కదూ నరహరిగారూ ?

నర : అవును. అవునని చెప్పడానికి చాలా బాధపడుతున్నాను. నేను చూశాను కూడా.

రామా : (విజయవంతంగా) మరి హంతకుడు ఎలా వెళ్లిపోయాడంటారు రాజారావు గారూ ?

[చాలా బాధాకరమైన నిశ్శబ్దం. అంతా రాజావంక చూస్తూంటారు.]

రాజా: ఒక నిండుప్రాణాన్ని నిలువునా తీసి హత్యానేరం మరో మనిషి నెత్తిన రుద్దేయగలిగిన హంతకుడికి దారే దొరక్క పోతుందా ఇక్కణ్ణుంచి పారిపోవడానికి !

రామా : క్షమించండి. ఎవరో కూడా ఆ సమాధానానికి అంగీకరించరు.

# ★ కాళరాత్రి ★

నళిని : హంతకుడు ఎక్కడికీ పారిపోలేదు. ఆ ఘాతకుడు ఇక్కడే—ఇప్పుడే గదిలో వున్న వాళ్ళల్లో నేవున్నాడు. తన మార్గం నిష్కంటకం చేసుకోవాలని నారాయణ ప్రాణాలు తీశాడు... నారాయణ ఎవరికి అంత ప్రతిబంధకంగా వున్నాడు? అతని చావు మూలాన ఎవరికి ఏమిటి లాభం? ఎందుకు చంపాల్సి వచ్చింది? ఆ కారణమేమిటో తెలిస్తే హంతకు డెవరో ఇట్టే కనుక్కోవచ్చు!

రామా : సరిగ్గా అదే నా ఆలోచన కూడా! కనిపెట్టాను అదేమిటో. నాదగ్గిరున్న సాక్ష్యం చాలు, రాజారావుగారు దోషిఅని నిర్ధారించడానికి.

సుకు : అవునవును.

నళిని : (తిరస్కారపూర్వకంగా) ఏమిటది? రాజారావుకి నారాయణ్ణి చంపి తీరాల్సిన అవసరంవుందా? ఏమిటో అది!

రాజా : అవును రామానుజం—చెప్తా కాస్త, నేనా హత్య ఎందుకు చేశానో కాస్త తెలుసుకుంటాను.

రామా : (అతని కేసి వస్తూ) నారాయణ్ణి నువ్వే - అంత మొందించావ్. అతని భార్యతో ప్రేమకలాపం సాగిస్తున్నావ్

రాజా : నోర్ముయ్ - (పిడికిలి బిగిస్తాడు)

నళిని : (చెయ్యిపట్టుకుని) రాజా!

రామా : (అదిరిపోయి) పట్టుకోండి - ఆపండి అతన్ని!

రాజా : చెంపలువాయించుకో ముందు నువ్విప్పుడు కూసినకూతకు!

రామా: అది నిజం. ఎంతమాత్రం అబద్ధం లేదందులో. అందరికీ తెలుసిక్కడ అదే నిజమని. (జేబులోంచి కవరు, అతికించిన వుత్తరంతీసి, ఇదుగో సాక్ష్యం!

రాజా : ఏమిటది?

రామా : ఉత్తరం! సరళాదేవి మీకు వ్రాసిన వుత్తరం!

రాజా : (మళ్ళీ కోపంవచ్చి) నువ్వెవడివని నా—

రామా : ఏం తప్పా? ఎందుకౌతుందీ తప్పు? చేసిందిదైతేనని ఒప్పుకుంటారా ఎవళ్లైనా సరే.

నళిని : వద్దు చదవక్కర్లేదు.

రాజా : చదవనీ నళినీ, మరేం ఫరవాలేదు.

రామా : ఫరవాలేదా? (చదువుతాడు) "ప్రియా! ఎప్పుడు రెక్కలు కట్టుకువచ్చి మీదగ్గర వాలుదామా అని ఎంత ఉత్రూత లూగుతున్నా—"

నళిని : ఓహో—(మొహం అటు తిప్పుకుంటుంది)

రాజా : ఏదీ నన్ను చూడనీ. మీకే చెప్పేది. ఇలా ఇవ్వండి?

రామా : (ఇవ్వక) "—ఎంత ఉత్రూత లూగుతున్నా ఓ రోజు ఆలస్యం అయి తీరాల్సి వచ్చింది—" తొందరపడుతున్నట్టున్నారు - అక్కడక్కడ చదువుతున్నా వినండి. "...మీరుకూడా నన్ను నుమానిస్తే ఎలా? మీరే నా ప్రాణాలు...మీరే నా సర్వస్వం! మన ఆనందం మన సౌఖ్యం పరిపూర్ణం కావాలంటే ఒకే ఒక మార్గం వుంది—" అదే నారాయణని హత మార్చడం! కదూ రాజారావుగారూ?

రాజా : నేనా వుత్తరం ఇంతవరకూ జన్మలో చూసైనా ఎరగ నసలు!

రామా : ఓ! మారుస్తున్నారా ప్లేటు! సరళాదేవి మీకిది వ్రాయలేదని మమ్మల్ని నమ్మించాలని చూస్తున్నారా?

రాజా : ఇది నాకు రాసిందికాదని ఖచ్చితంగా చెప్తూంటే!

రామా : ఇదుగో కవరు! దీనిమీద అడ్రసు వ్రాసిన దస్తూరీ, ఈ వుత్తరంలో దస్తూరీ ఒక్కటే! అడ్రసు మీది!

రాజా : కావచ్చు, సరళాదేవి దగ్గర్నుంచి నాకీపూట ఉత్తరం ఒకటి వచ్చిన మాట నిజమేగాని ఇదిమాత్రం కాదు.

నర : ఐతే ఏదో పొరబాటు జరిగి వుంటుం దిక్కడ. నీకొచ్చిన వుత్తరం చూపించు రాజారావ్—

రాజా: ఆఁ - (జేబులు తడుముకుంటూ) ఆఁ - అది- అదిలేదే...చింపేసి వుంటాను- పెద్ద అవసరమైందికూడా కాదు.

రామా : పోనీ ఏం చేశారా ముక్కలు?

రాజా : ఏం చేస్తాను - ఏ చిత్తుకాగితాల బుట్టలోనో పారేసివుంటాను!

రామా : (విజయవంతంగా) ఆఁ! అవే! దొరికినయ్ నాకక్కడే!

[నరహరి సవిచారంగా తల అడ్డంగా వూపి అటు వెళ్తాడు.]

రాజా : (ఆవేశంతో) నేను ప్రమాణం చేసి చెపున్నాను - ఆ వుత్తరం నాకు వ్రాసిందికాదు నమ్మండి-(నమ్మని ముఖాల వంక చూస్తాడు. నళిని ఇంకా అటు తిరిగే వుంటుంది) హుఁ - 'తోడేలు - తోడేలు' అని అరిచిన గొల్లపిల్లవాడంటే ఇప్పుడు జాలి వేస్తోంది నాకు.

నళిని : (అకస్మాత్తుగా రామానుజంతో) ఏదీ - నేను చూడవచ్చా ఆ వుతరం?

[రామానుజం వెనకడుగు వేస్తాడు.]

నళిని : (అసహ్యంతో) మరేం భయపడక్కర్లేదు. మళ్ళీ మీకే యిచ్చేస్తాను.

[అయిష్టంతోనే ఇస్తాడు సుకుచూచి-]

ఇది రాజారావుకి వ్రాసిందని ఏమిటి దాఖలా?

రామా : ఏం? అందులో వుందిగా—

నళిని : 'ప్రియా' అని! అది ఎవరికైనా కావచ్చు...ఆమె భర్తకే రాసుకున్న ఉత్తరం కావచ్చు.

రామా : తాపీగా చూడండి కాస్త. 'మీరుకూడా నన్ను నుమానిస్తే ఎలా' 'మీరైనా నన్ను ప్రేమించకపోతే' అనే పదాలే సూచిస్తున్నాయి, ఈ వుత్తరం

భర్తను మినహాయించి మరో ప్రియుడికి సంబోధించబడిందని !

నళిని : ఈ ముక్కలన్నీ పోగుచేసి అతికించిందెవరు ?

సుకు : నేనూ నరహరిగారూ.

నళిని : రామానుజంగారిచ్చిన ముక్కల్లోంచి ఏరుకునా ?

నర : ఆయనిచ్చిన ముక్కలన్నీ ఇవ్వే!

నళిని: ఇవ్విదొరికినచోట ఇంకే కాగితం ముక్కలులేవా ?

రామా : లేవు. ఆముక్కలూ ఈ కవరూ మాత్రమే.

[మోహన్ బుట్ట బోర్లించిచూస్తాడు. ఏమీ కనపడవు]

నళిని : ఈపూట ఎవళ్లకెవళ్ళొచ్చి వయ్ రాజా ఉత్తరాలు ?

[ఉత్తరం మేజామీద వుంచగా రామానుజం తీసుకుంటాడు]

రాజా : ఏమో నాకు జ్ఞాపకం లేదు. అవన్నీ కమల తీసుకెళ్ళింది. ఎవళ్ళవి వాళ్ళ కివ్వడానికి.

నళిని : కమలా ?...ఓ నరహరిగారి భార్య !...అవును - ఆవిడ తీసుకెళ్లడం నే చూశాను.

[కమలసోఫాలో ఓచివర కూర్చుని వుంటుంది. ముఖంలో ఆందోళన, కంగారు ఎక్కువౌతున్నట్లుంది. ఆమె కేసివస్తూ.] ఏమండీ కమలాదేవిగారూ?

కమల : దాదాపూ అందరికీ వచ్చాయి.

నర : (నెమ్మదిగా) ఏమిటీ ప్రశ్నలవల్ల ఉపయోగం నళినీదేవీ ?

నళిని : ఏముందీ-ఈవుత్తరం ఎవరికైతే వ్రాయబడిందో, అతడే నా రాయణని కాల్చి చంపిన హంతకుడు ! వాడెవడో కనిపెట్టి తీర్తానుకూడా.

[కమల చేతుల్లో ముఖం కప్పుకుని ఏడుస్తుంది]

నర : కమలా!

కమల : నన్నిక్కణ్ణుంచి తీసుకెళ్లండి... నన్నిక్కణ్ణుంచి తీసుకెళ్లండి.

[లేచిదారికోసం వెతుకులాడుతూ భోజనాలగదిలోకి వెళ్ళిపోతుంది. అంతా లేచి నుంచుంటారు.]

నర : సరే—ఇక మనందరం కూడా—

మో: ఆగు. నువ్వింకా అడగాల్సిందేమన్నా వుందా నళినీ ?

నళిని : (నిరాశతో) లేదు—ఇంకేం లేదు.

సుకు : బతికించారుబాబూ. (భోజనాలగదివైపు వెళ్తూ) ఈ లంకనుంచి ఎంత తొందరగా బైటపడితే అంతమంచిదని నా అంతర్వాణి హెచ్చరిస్తూనే వుంది. రారా మోహన్.

(మోహన్ని లాక్కుపోబోతాడు. అతడు విదిలించుకుంటాడు)

మో : సరే అయితే వస్తాను రాజారావ్. నీకేం కావల్సివచ్చినా సరే నన్ను పిలు.

(వెళ్తాడు. వెనకాలే సుకుమార్ కూడా వెళ్తాడు)

రామా : (వరండా వాకిలికేసి పోతూ రాజాని తప్పించుకుని) మీరుకనక ప్రయత్నం చేశారోతప్పించుకు పారిపోవడానికి, బలవంతంగానైనా సరే కట్టి పడెయ్యాల్సిన అవసరం వస్తుంది.

[రాజా ఓ అడుగు ముందుకు వేస్తాడు. రామానుజం గభగబా రెండడుగులు వెనక్కు వేసి—]

వెంకన్నా !

వెంకన్న : బాబూ !

రామా: నీతో మాట్లాడాలి! నాతోరా.. మీరుకూడా వస్తారా నరహరిగారూ ?

[రాజా వచ్చి ఎక్కడ మీద పడతాడో నని 'అతన్నో కంట కనిపెడుతూ వాకిలికేసి వెనక్కి నడుస్తాడు. నరహరి చాలా విచారంగా, జాలితో తల ఆడించి రామానుజంతో వరండాలోకి వెళ్తాడు.]

వెంక : ఇది నాకేం బాగులేదు బాబూ— (నళినిని చూసి) ఓ – నళినమ్మగారింకా వున్నారు !

నళిని : నే కాస్సేపు వుంటాలే వెంకన్నా.

రాజా : వెళ్ళిపో నళినీ నువ్వుకూడా. నామాట విను.

నళిని : అదికాదు రాజా—

రాజా : ఏదీకాదు. కాస్సేపు నే చేసిన పాపాలు లెక్కబెట్టుకుంటూ కూర్చుంటాను వంటరిగా. నన్నిలా వదిలెయ్.

[నళిని ఆందోళనా పూరితమైన దృక్కుల్తో అతనివంక నోక్షణంచూసి వరండాలోకి వెళ్తుంది.

రాజా మేజాముందు తలమీద చేతులు పెట్టుకుని కూర్చుంటాడు.]

వెంకన్న : (రహస్యంగా) బాబూ—

రాజా : (విసుగుతో తలయెత్తి) ఏం వెంకన్నా ?

వెంకన్న : మనం మాట్లాడుకున్న సంగతి నే నెవళ్ళకీ చెప్పలేదు బాబూ.

[రాజా అర్థంకాక చూస్తాడు.]

అదే బాబూ - ప్రమాదం సంగతి !

రాజా : ఓ - అవును. నే నసలు మర్చేపోయా నా విషయం. ఎన్నో సంవత్సరాల కిందటి సంగతిలా వుంది. రివాల్వరులో తోటాలు. పెడుతున్నాను కదూ, అప్పుడు? పెడుతూ అన్నాను—'నా అతిథుల్లో ఎవరన్నా.....'

వెంక: (భయంతో అటూ ఇటూ చూసి) ఇవ్—

వెంక : (జేబులోంచి తీసియిస్తూ) లాంచి తాళంచేతులు బాబూ !

రాజా : ఇవ్వెక్కడివి నీకు ?

వెంక : లాంచిలోంచి తీసుకొచ్చాను.

రాజా : (తీసుకుంటూ) ఎందుకు ?

వెంక : వాళ్లు మిమ్మల్ని పోలీసుల కప్పగించడం నాకు ఇష్టమనుకున్నారాబాబూ?

రాజా : థాంక్స్ వెంకన్నా కాని న్యాయం కోసం పాటుబడుతున్న వాళ్ళకి ఏవిధమైన ఆటంకమూ కలిగించడం అంత మంచిపనికాదు.

[కాస్సేపు తాళంచేతుల్ని పరిశీలించి జేబులో వేసుకుంటాడు.]

వెంక : (పెద్దబరువుదిగి) ఇంకేమన్నా కావాలా బాబూ ?

రాజా : కొస్త టీ వెచ్చబెట్టి తీసుకు రాగలవా ?

వెంక : అలాగే బాబూ.

రాజా : ఫ్లాస్కునిండా తీసుకు రా రెండుమూడు గ్లాసులూనూ. ఇంకోళ్లకూడా కావాల్సొస్తుంది.

[వెంకన్న భోజనాలగదిలోకి వెళ్తాడు.

(54-వ పేజీ చూడండి)

# ఆహవనృత్యం

శ్రీ సూరంపూడి భాస్కరరావు

పూర్వం శ్రీ కృష్ణదేవరాయ మహారాజులుంగారు రాజ్యానికివచ్చిన కొద్దికాలంలోనే ఒక యుద్ధావసర మేర్పడింది. ఆ యుద్ధానికి విశేషమైన శత్రుత్వమేమీ కారణంకాదు. కేవలం విలాసానికి ఒకనాడుదయాన్నే రాయలవారు రథగజ తురగ పదాతులతో కూడిన ఒక సైన్యదళాన్ని అమాత్యశేఖరుడితో సహా పర్యవేక్షించటానికి ఒక చతురపు మైదానంలో సమావేశ పరచుకొన్నారు.

అనాలోచితంగా అదేసమయానికి మరో ప్రక్కనుంచి ఇంకొక సేనాదళం రథగజ తురగ పదాతియుక్తమై ఒక రాజకుమారుడు, అమాత్యులు వెంటరాగా, ఆ మైదాన పుటావలి కొసని బారులుదీర్చి నుంచున్నది. రెండు సేనాదళాలు ఒక క్షేత్రంలో ఎదురెదురుగానుంచున్నట్లైతే యుద్ధానికి తల పడక తప్పదు గదా. సరే సిద్ధమయారు.

రాయలవా రప్పటియుద్ధ ధర్మాన్ననుసరించి మొదటిదెబ్బ యెవరుతీయాలో అమాత్యముఖతః అడిగారు. ఆ పరరాజ కుమారుడన్నాడుకదా, ఈ రణరంగంలో మొదటిగా మీరు ప్రవేశించి ఉన్నారు కాబట్టి మీరే మొదటిదెబ్బ తీయండి అన్నాడు. రాయలవారి కిది అంతగా రుచించక పోయినా అంగీకరించి, తెల్లటి అంగీలు తొడుక్కున్న తన దళాన్ని యథాస్థానాల్లో నిలబెట్టే ముందు మళ్లీ ఒకప్రశ్న వేయించాడు, "ఈనాటికి విదేశీయులు మన దేశంలో అడుగు పెట్టారుకదా. అందుచేత వాళ్ళ యుద్ధసంప్రదాయంకూడా మాకు తెలిసేఉంది. అయితే మీకు మన దేశీయ సంప్రదాయం ఇష్టమైతే ఆ ప్రకారం యుద్ధం చేద్దాము, లేదా, వినోదంగా ఉంటుందంటే విదేశీయ పద్ధతినే యుద్ధం నడుపుదాము' అన్నారు.

పరరాజకుమారుడు "విదేశీయ పద్ధతిలో కూడా మాకు కొంచెం నైపుణ్యం ఉంది,ఆ విధంగానే సాగిద్దాము"అన్నాడు. సన్నద్ధులయేందుకు రాజకుమారుడి సేనాదళం అంతా నల్లటి అంగరఖాలు తొడుక్కున్నారు. రాయలవారు సేనామధ్యమందు సురక్షితస్థానంలో నిలబడి ఆంతరంగికుడూ పరాక్రమవంతుడూ కావటంచేత అమాత్యుణ్ణి తన యెడమప్రక్కగా నుంచోబెట్టుకునీ, అటూఇటూ రథాలూ, వాటికి అవతలగా రెండువైపులా అశ్వాలూ, ఆ పిదప రెండుకొసలా బలమైన రక్షణ ఉండాలికదా అని ఏనుగులూ నిలబెట్టి ముందువరసలో పదాతులను నుంచోమని శంఖం పూరించాడు.

వైదేశిక సాంప్రదాయమైనా నాటి యుద్ధంలో నేటియుద్ధంలా కాక, "దెబ్బకు దెబ్బ" అనే సూత్రాన్నే గాని "దెబ్బమీద దెబ్బ"అని ఎప్పుడూ సాగించేవారుకాదు. కాగా మొదటదెబ్బతీయవలసినరాయలవారు ఆలోచించి గుఱ్ఱాలను ముందుకి దూకించడంకంటె పదాతుల్ని నడిపించటమే యుద్ధరహస్యంలో ఉత్తమమైనదిగా తలిచి,ప్రథమంగా రాయలవారు తమ ముందున్న పదాతిని రెండంగలు ముందుకు నడిపించారు. ఎదురుగా నిలబడ్డ రాజకుమారుడుకూడా తన పదాతిని రెండంగలుముందుకు దూకించి రాయలవారి పదాతిని అడ్డుకున్నాడు. పదాతులు ఎదురెదురుగా ఉంటే ఒకరి దాలుమీద



మరొకరు కత్తితో మోదటమే కాని, సంహార కృత్యం జరగకుండా ఉంది. కానీ అని రాయలవారు తమ స్వంతఅశ్వికుణ్ణి ఎదురు బంటును కొట్టేందుకు వీలుగా మూడంగలు దూకించారు. రాజకుమారుడుకూడా, మా బంటును కొట్టినట్లయితే మీ అశ్వాన్ని తెగనరుకుతాం అన్నట్టుగా తన మంత్రిగారి పదాతిని రాజబంటుకు రక్షణగా ఒక అంగ ముందుకు పంపారు. ఈ రక్షణపద్ధతి చూచి, రాయలవారింక మెల్లిగా రణరంగంలోకి దూకించదలచారు. దానికి మొదటి మెట్టుగా తమ మంత్రి బంటును కొంచెం సాహసంగా రెండంగలు ముందుకు వెళ్ళమన్నారు. అయితే నల్లఅంగీ తొడుక్కున్న రాజబంటు ఒక్కపోటుకి రాయలవారి మంత్రి బంటును చంపి ఉండును. కాని రాజాజ్ఞ మీరకూడదు. అందుచేత ఆయన ఎక్కడ దెబ్బతీయదలిచారో అని ఆజ్ఞకోసం బలంఅంతా వేచి ఉన్నారు. రాజకుమారుడు ఆలోచించాడు. శత్రు రాజుల మంత్రిబంటును నా బంటుచే చంపించితే శత్రుమంత్రి ఒక్క దూకులో వచ్చి నా బంటుని తిరిగి చంపుతాడుకదా! దీనివల్ల పర్యవసానం వాళ్ళమంత్రిని తొడ చరిచి ముందుకురమ్మనడమే అవుతుంది. ఒకవేళ వాళ్ళమంత్రిబంటే మా బంటుని చంపుతే, దానికి ప్రతీకారం చెయ్యలేక పోతామా?" అని తన మంత్రి రథాన్ని అశ్వపథంలో అయిదంగలు దూకించి నిలిపాడు. దాంతో ముందుకు వచ్చిన రాయలవారి అశ్వికుడు ముల్లునుగుచ్చిన ఈగలాగ కదలలేకపోయాడు. కారణమేమంటే తన ప్రాణం దక్కించుకుందామని, శత్రుబంటుని చంపుదామనీ పరిగెట్టినట్టైతే తన మీదుగా బారెట్టి ఉంచిన బాణంతో ఆ బారులో ఉన్న తమ మంత్రిగారి ప్రాణం కాస్తా హరీఅంటుంది. అందుచేత ఈ చిక్కు తప్పించడానికి రాజు శత్రుబంటునొక్కపోటు పొడవమని తన మంత్రి బంటుకాజ్ఞ ఇచ్చాడు. రాజకుమారుడికి చిక్కొచ్చింది. తమ మంత్రిబంటు చేత ఆ బంటును చంపితే ఆ మంత్రి నిలువునా దారికాళీగా ఉండికనక వచ్చి తన మంత్రినివధిస్తే మళ్లీ రాజుగారు స్వయంగా మంత్రిని వధించేందుకు స్థానం చెడవలసి వస్తుంది, పోగా తరవాత దెబ్బలో వృధాగా తన పదాతి అవనంగా మరణిస్తాడు, ఎందుకిలా బలం నష్టపోవడం అని ముందు, రణరంగంలో ఉన్న తరధకుడికి, శత్రువుయొక్క అశ్వాన్ని సంహరించమని అజ్ఞఇచ్చాడు. అశ్వాన్ని సంహరించిన రథికుణ్ణి ఉపేక్షించడమెలా? అందుకని రాయలవారు తమ మంత్రిని పంపి రథికుణ్ణి హతమార్చాడు. అశ్వానికి రక్షం పోతేపోయింది, బంటుకి బంటును సంహరించాలికదా అని ఇప్పుడు తనమంత్రిబంటుద్వారా శత్రుబంటును సంహరించాడు రాజకుమారుడు.

సరే కానిమ్మని రాయలవారు తమ రథికుణ్ణి రథికమార్గంలో నాలుగంగలు ముందుకి దూకించారు. దీంతో రాజకుమారుడి పరిస్థితి కొంచెం చిక్కులోపడ్డది. రాజకుమారుడు ఏపాటి ఏమరుపాటుగాని ఉన్నా తాను శత్రువుల చేతిలో చిక్కుకుంటాడు. అందుచేత రాజకుమారుడు, శత్రుమంత్రి, తన రథికుడి పదాతిని పొట్టని పెట్టుకోవడం ద్వారా తనమీద ఎక్కడ విరుచుకుపడతాడోనని, తన అశ్వికుణ్ణి అడ్డువేశాడు. రాయలవారి మంత్రి (రాజాజ్ఞచొప్పున) ఒక్కదాటు పక్కకివేసి తన అశ్వికుడి బారులో నిలబడ్డాడు. ఈ నడకతోటి రాయలవారిమంత్రి సవ్యసాచిలా రెండు వైపులకి బాణాలెక్కుపెట్టాడు. ఒకవైపున శత్రుమంత్రియొక్క అశ్వికుడిముందున్న బంటుని సంహరించేందుకు, మరొకవైపున తన రథికుడికి మద్దతుఇచ్చి పరరాజ రథికుడి పదాతిని హతమార్చి రాజకుమారుడిమీదే కత్తి ఝుళిపించేందుకు సిద్ధమయ్యాడు. ఎత్తుకి తగ్గఎత్తు రాజులకు తెలిసిందేకదా. వెంటనే రాజకుమారుడు తనమంత్రిని తనముందొక్క అంగలో నిలబెట్టాడు. రాయలవారిమంత్రికి ఎదుటి బంటొకటి కబళించడానిక్కి అందుబాటులోనే ఉన్నా, బలం కూడగట్టుకున్నాక రంగమధ్యం విధ్వంసచర్య యుక్తియుక్తంగా జరపవచ్చునన్న నీతిప్రకారం తన అశ్వికుణ్ణి రథికుడి బారులోకి మూడంగలు వేయించాడు. రాజకుమారుడు కూడా విధ్వంసం జరగకపోయినందుకు సంతోషించి, తన మంత్రిగారి రథికుడి ముందున్న బంటుని ఒక అంగముందుకి పంపి అరక్షితుడుగా ఉన్న పదాతికి మంత్రిగారి రక్షణ చేకూర్చాడు. కాని రాయలవారియుద్ధనైపుణ్యంముందు ఇంకా మీసకట్టైనా పొడసూపని రాజకుమారుడిశక్తి ఎంతపాటిది గనక. రాయలవారు తమ రథికుణ్ణి రాజా శ్రీ



# ★ ఆహవ నృత్యం ★

కుడిబారులు అయిదంగలు ముందుకి దుమికించారు. "యుద్ధం రాజధర్మంగనక, నడిచినంతవరకూ నడిపిద్దాం" అన్న పద్ధతిలో రాజకుమారుడు తన మంత్రిగారి అశ్వికుడి బంటుని రెండంగలు ముందుకి దూకించారు. రాయలవారి మనస్సులోను, వారి మంత్రిగారి మనస్సులోను ఎంతగంభీరమైన పన్నుగడలున్నాయో అప్పుడే యెక్కడ తెలుస్తుంది? తమ అశ్వికుడిద్వారా, ఎదుటి అశ్వికుడిబంటుని కబళించారు. కాని ఆ బంటుకి అండగాఉన్న బంటు ఊరుకుంటాడా? రాయలవారి అశ్వికుణ్ణి తక్కున పొడిచాడు. వెంటనే రాయలవారి రథికుడా బంటును కబళించి రాజకుమారుడిమీదికి బాణం ఎక్కుపెట్టాడు. వెంటనే తన మంత్రిగారి అశ్వికుణ్ణి తమ మంత్రిగారి స్థావరానికి ముందు ఒక అంగలో అడ్డం వేసుకున్నారు. రాయలవారు ఎడమకి రెండంగలు వేసి మంత్రిగారి కోసనున్న ఏనుగను కుడిప్రక్క నిలిపి బలమైనకోట నిర్మించుకు నుంచున్నారు. ఈ ఏనుగు రాకడవల్ల రాజకుమారుడికి అడ్డుగానిలిచిన అశ్వికుడి పరిస్థితి తద్వారా, రాడకుమారుడి పరిస్థితి, మంత్రి పరిస్థితికూడా విషమించాయి. అందుకోసం యీ అశ్వికుడికి అండగా మంత్రిగారి ఏనుగను మంత్రిగారిస్థానానికి తీసుకొచ్చి కొంత తాత్కాలిక రక్షణ కలిగించుకున్నాడు రాజకుమారుడు. కాని రాయలవారు ఇందాకా బంటుకి అశ్వికుణ్ణి బలియిచ్చినట్టే అశ్వికుడికోసం ఏనుగుని బలియిచ్చారు. అంటే ఏనుగుతో అశ్వికుణ్ణి సంహరించారు. వెంటనే రాజకుమారుడు తమ ఏనుగుతో రాయలవారి ఏనుగును ప్రతిసంహరించాడు. అయితే ఆ ఏనుగు రథికుడి బాణానికీ రాజకుమారుడికీ మధ్య అడ్డుగా నుంచున్నకారణంగా కదిలే పరిస్థితిలో లేదు. అందుచేత రాయలవారు, తమ భద్రగజాన్ని తెచ్చి మంత్రిగారి స్థావరంలో నిలబెట్టారు. రాజకుమారుడి మంత్రి వెంటనే ఉన్నచోటనించి ఒక అంగ ముందుకువేసి తన రాజాశ్వికుడి ఆపత్తులోఉన్న యేనుగుకి సహాయంవచ్చేందుకు వీలుకలిగించాడు. ఈ క్షణంలో రాజకుమారుడి పరిస్థితి తబ్బిబ్బుగా ఉండడం, విజయశంఖం రాయలవారే పూరించడం తప్పదని అందరికీ తెలిసింది. కాని రాయలవారి విజయం మెరపులాగా అంతశీఘ్రంగా వస్తుందని ఎవరూ అనుకోలేదు. రాయలవారు చేసిందేమిటంటే కొంచెం సాహసంగా, రథికుని పంపి, ఏనుగని చంపి, రాజకుమారుడిమీద కత్తిపోట్లు చేశారు. రాజకుమారుడు అశ్వికుడిద్వారా రథికుణ్ణి మింగి ఊరుకున్నాడు. ఇంకా తెగించి రాయలవారు మంత్రిని అశ్వికపక్షంలో కడస్థానానికిపంపి రాజకుమారుడిమీద కత్తిదూశారు. రాయలవారి మంత్రి పట్టుబడ్డాడంటే పట్టుపడ్డాడని సంబరపాటుతో తన అశ్వికుడిద్వారానే మళ్లీ రాయలవారి మంత్రిని సంహరించాడు రాజకుమారుడు. ఇంతలో ఏంజరిగింది? రాయలవారి ఏనుగు, తమ రథికుడి బలంతో, ఒక్కదూకున శత్రుమంత్రిస్థానానికి వెళ్లి రాజకుమారుడిమీద పడింది. రాజకుమారుడికి పారిపోయేందుకు దారేది? తన మంత్రి, ఏనుగు, అశ్వికుడు రథికుడూ రణరంగంలో తెల్లబోయి నుంచున్నారేగాని, రాజకుమారుణ్ణి రక్షించడానికి తగినంత దగ్గరలో ఎవ్వరూలేరు. ఒక్క రథికుణ్ణి ఏనుగనీ పెట్టుకుని రాజకుమారిడి సేనమీద సంపూర్ణవిజయం పొందారు రాయలవారు. "మూరు రాయరగండ శ్రీకృష్ణదేవరాయమహారాజా శరణుశరణు" అన్నాడు రాజకుమారుడు. యుద్ధం ముగిసింది.

రాయలవారు రాజకుమారుడిని లేవనెత్తి "మీరు ఎవరి కుమారులు?" అని అడిగారు. రాజకుమారుడు సిగ్గుపడిపోయాడు. రాయలవారు కొంచెం తేరిపార చూచి, "ఏమిటి రాణీ తిరుమలదేవమ్మగారి ముఖంలా ఉన్నది?" అని కిరీటం ఒత్తిగించారు. బారెడు పొడుగున నల్లత్రాచులా మల్లెలవాసనతో వాలుజడ దిగ ప్రాకింది. ఇంకేం, ఎల్లరూ సంతోషించి రాయలవారూ రాణిగారు చతురంగ క్రీడలాడారు అన్నారు. ఏరహస్యాలోచన జరిగిందో గాని, సంహరింపబడ్డారన్న యోధులంతా రణక్షేత్రంలోనుంచి తప్పుకున్నారేగాని నిజంగా మృతులుకానేలేదు. తమ మంత్రిగారు రాణీవారు పన్నిన యీపన్నాగం ఎంతో వినోదం కూర్చడంవల్ల, నాటినుంచీ రాయలవారు కోటలోనే యీఆహవనృత్యం, యుక్తులు ప్రతియుక్తులు వినియోగించి సంతోషించేవారు.

[ఇది చరిత్రకానే కాదు. చదరంగం అని ఆడబడే ఆటలో కాయలకి బదులు మానవులు నిలబడడం సహజం కాకపోయినా వినోదం మాత్రం అవును. అదీకాక ప్రతి కాయకీ చదరంగంలో మానవత్వం ఉంది. ఎందుచేతంటే, చతురంగక్రీడలో వివిధ శ్రేణులకు చెందిన యుద్ధవీరులకు ప్రతిబింబాలుగా యీకాయలు సృష్టింపబడ్డాయి. చతురంగంలో ప్రతిఆటా ఒకకథలా చెప్పవచ్చు. అలా చెప్పవచ్చునని నిరూపించటమే ఈకథయొక్క ఉద్దేశ్యం.

ఈకథలో *Morphy Vs Duke of Brunswick* ఆడినఆట చిత్రించబడింది. అంతర్జాతీయపద్ధతి ఎరిగినవారు, ఈకథద్వారా ఆడుకోవచ్చును.] ★

# అవాంతరం

శ్రీ టేకుమళ్ళ కామేశ్వరరావు

తండ్రి దగ్గరనుంచి వచ్చిన లేఖను భయపడుతూ విప్పేడు జానకీప్రియమూర్తి. మనస్సులో చదువుకోడం ప్రారంభించేడు.

“అబ్బాయీ!

నీవు నీ పెండ్లివిషయమై వ్రాసిన ప్రత్యుత్తరాన్ని చదువుకొన్నాము. నేనుగాని, మీ అమ్మగాని, మరెవ్వరుగాని నీ లేఖలో హర్షించతగ్గ విషయమొక్కటీ కనబడలేదు. మేము కులగోత్రాదులు సవిస్తరంగా పరిశీలించి ఏ కన్యనో పెళ్లిచేయవలసుండగా, నీవు నీ ఇష్టం వచ్చినట్లుగా చేసుకొంటాననడం సబబుకాదు!”...

అంతమట్టుకు చదివి ఆగి జానకీప్రియమూర్తి మొదటి అంశాన్ని ఖండించదలుచుకొన్నాడు “నేను కళ్ళు మూసుకొని ప్రేమించలేదే! భగవంతుడిచ్చిన వివేకాన్ని మూలపెట్టి నేను వ్యవహరించడం లేదే! పూర్వపు కట్టుబాట్లలో మేలైన వాటిని మెచ్చుకొని, ఇటీవల బయలుదేరిన అనాచారాలను అంతమొందించడమే నా పని!' అనుకొన్నాడు. లేఖలోని విషయాలు చూడడానికి మనస్సు తొందరపడగా అతను 'ఇంకా ఏమేమి వింతలున్నాయో ఒకసారి చూద్దాం!' అనుకొన్నాడు.

జానకీప్రియమూర్తి విశాఖపట్టణం ఆంధ్ర మెడికల్ కాలేజీలో ఎం. బి. (వైద్యవృత్తి) ఆఖరు సంవత్సరం చదువుతున్నాడు. ఆ సంవత్సరం పరీక్షలో నెగ్గడంతోనే సంపూర్ణ వైద్యుడవుతాడు. అతని వయస్సు ఇరవైయేడు.

అతను మళ్లీ చదవడం మొదలుపెట్టేడు. “నీవు కులగోత్రాలను చూడకుండా పెళ్ళి చేసుకొంటున్నావనే నేను ఖండితంగా చెప్పుతున్నాను. ఎందుచేతంటే మన బ్రాహ్మణ్యంలో వైదీకులలో వెలనాటి వాళ్లమై ఉండగా నీవు బ్రాహ్మణ్యంలోనే మరొక శాఖయైన ద్రావిళ్ల పిల్లను చేసుకోడం ఎంతమాత్రము తగదు! శాఖలకీ శాఖలకీ మధ్య వైవాహికాది పొత్తులు లేవన్న సంగతి నేను నీకు వివరించనక్కర లేదు కదా!”

జానకీప్రియమూర్తికి రవరవ మండిపోయింది. కూర్చున్నవాడల్లా లేచి నిల్చున్నాడు. “వేదాలలో బ్రాహ్మణ్యమన్నమాటే ఉందికాని మీ శాఖలు, అంతశ్శాఖలు, ఉపశాఖలు, చిగుళ్లు ఎక్కడున్నాయి. ఇన్ని శాఖోపశాఖలయిపోయి చెట్టుకో పిట్టయిపోతున్నారు. ఈ పిట్టలన్నిటిని ఒక్కచోట చేర్చి పొత్తు కల్పించాలంటే ఈ శాఖలన్నిటిని ఛేదించి పారేసి, మూలాన్ని మాత్రమే నిలబెట్టాలి. దానికోసమే నేను కత్తికట్టి యుద్ధం చెయ్య తలపెట్టేను” అనుకొన్నాడు వైద్యపుబిడ్డ.

అతను ఉత్తరం తీసేడు. “నాయనా? నీవు ఒక్కవిషయం ఆలోచించాలి! చదువుకొన్న పిల్లతో కాపరం సరిగా నెరవేరడం లేదు. ఇదివరలో మనకు అనుభవమే! ఎంతమందిని చూడడంలేదు మనం, తగాదాలు పెట్టుకొని విడిపోయినవారివి! కాబట్టి నీవు చెప్పే పిల్లసంగతికూడ ముందుముందు అంతే అవుతుంది. అక్షరాలా అంతే!”

అక్కడికి ఆపుచేసి వైద్యవిద్యార్థి దానినిగురించి తలపోసేడు. “ఈ అంశంలో కొంత సబబు లేకపోలేదు. దీనికి నిదర్శనాలు మా కుటుంబంలోను, స్నేహితుల కుటుంబాలలోను కూడ ఉన్నమాట నిజమే! కాని దీనిలో ఎప్పటికీ తేలని ఒక అంశమేమిటంటే - సంబంధాలు విడిపోడానికి తల్లిదండ్రులెంతవరకు కారణమనేది. వాళ్ళు యువతీ యువకులు చెప్పినట్లల్లా చేయక, మీ ఖర్మ మెట్లాగుంటే అట్లాగుంటుంది ఒక్కచోట పడి చావండర్రా అని ఊరుకొంటే కొంతవరకు ఒప్పైపోతుంది. కాబట్టి ఆ అంశాన్ని నేను సంపూర్ణంగా ఆమోదించను. ఇంతకీ మా 'తరళాక్షి' అటువంటిది కానే కాదని నేను బల్లగుద్ది చెప్తాను. కావలిస్తే కాగితం మీద రాసిస్తాను...ఈలేఖలో ఇంకా ఏమేమి చిత్రాలున్నాయో చూద్దాం”అనుకొంటూ అతను మళ్ళీ చదవడం మొదలు పెట్టేడు—

“నీకు వేలకి వేలు కట్నా లిస్తామంటున్నారు కొందరు. కలెక్టర్లదగ్గరనుంచి, జడ్జీలదగ్గరనుంచి పిల్లల నిస్తామంటూ తొందర చేస్తున్నారు. కట్నరూపంగా వచ్చే డబ్బుకి మితంలేదు. కాబట్టి వచ్చే డబ్బును పోగొట్టుకో కూడదు. యువకుని విలువకు కట్నమే నిదర్శనం!” అని చదువుకొని జానకీప్రియమూర్తి పకాలున నవ్వుకొన్నాడు. “నన్ను మా అమ్మ నాన్న అమ్మెయ్యాలని చూస్తున్నారు. నేను కాచుకోవాలి! కట్నాలిచ్చుకొని ఎంతమంది కొంపలను గుండం చేసుకొన్నారో మా నాన్న ఆలోచించడంలేదు. సంఘంలో ప్రబలిన ఇదొక ఘోర దురాచారం! దీనితో నేను అతిఘోరంగా యుద్ధం చెయ్యకమానను. కట్నం పేరు చెప్పితే సిగ్గు సిగ్గు! అటువంటి పాపపు ధనం పుచ్చుకొని నేను గౌరవం పోగొట్టుకోను! దుష్టమార్గాన్ని ధనం సంపాదించేనన్న పేరు నాకు ససేమిరా వద్దు! ముమ్మాటికీ వద్దు!” అని తీవ్రంగా తలపోసేడు. మిగతసంగతుల కోసం అతను ఉత్తరం తీసి ఈలాగు చదివేడు.

“అబ్బాయీ! ప్రేమ వివాహాలు పటక్కున పేలిపోడం మనం కళ్ళార చూస్తూనే ఉన్నాం. ఇదిగో పుస్తిఅంటే, ఇదిగో విడాకులంటూ వినబడుతూంది. అటువంటి సందర్భంలో నీవు చెప్పుతూన్న దానికి కూడ పట్టే దుర్గతిని మనం ముందే ఊహించుకోవచ్చు. కాబట్టి నీవు దాని పొంతకి పోకు!” అని చదువుతూండగా అతని బుజాలమీద మెత్తగా చేతులు



# అవాంతరం



తాకేయి. కంగారు పడి వెనక్కి తిరిగి చూసేడు.

ప్రేమ దూషిణియైన తరళాక్షి అతని కంగారును చూసి ఒకటే నవ్వింది!

"ఏమంతగా నవ్వుతున్నావు?" అన్నాడు మూర్తి నొచ్చుకున్నవాడిలాగు.

"నేను ఇక్కడికి వచ్చి ఎంత సేపయింది?"

"ఎంతసేపయిందంటావు?" అన్నాడు.

"అయిదు నిమిషాలు పైనయింది!"

ఆమె తనచేతిలోని లేఖను చూసిందేమో అని అతనికి అనుమానం కలిగింది.

"ఏమిటది, అంత దీక్షగా చదువుతున్నావు! నన్ను కూడ చూడనియ్యి!" అంది తరళాక్షి.

"ఏమీ లేదు లే!"

"అబ్బా కాదు!"

"రహస్యమా?" అంది.

"కాదు లే!"

"మరి చెప్పకూడని రహస్యమా ఏమిటే?" అంది ప్రియురాలు. అతనికి గొంతుకలో పచ్చి వెలగకాయ చిక్కుపడ్డట్లయింది. ఏం చెప్పితే ఏమి నష్టమో అని ఊరుకొన్నాడు.

కోపగించి అతని చేతిలోంచి లాగుకొంది తరళాక్షి.

అతనికి ఏమనాలో తోచలేదు. మళ్ళీ లాగుకొంటే ఆమెకు కోపం వస్తుందేమో అనుకొంటూ ఊరుకొన్నాడు.

ఆమె లేఖను పూర్తిగా చదివేసి "మీ నాయన ఒట్టి పూర్వకాలపుమనిషి. చాదస్తుడు. ఒట్టి అనుమానపుమనిషి. ఇంకా ఎన్ని అనాలో అన్నీ అనవచ్చు" అంది ప్రేమికురాలు.

అన్నిటికీ ఒప్పుకొన్నవాడిలాగే జానకీప్రియమూర్తి ఊరుకొన్నాడు.

"అన్నీ ఆ మాటకేమిగాని దానిలో ఆఖరివాక్యాలే నా మనస్సును శూలంలాగు గుచ్చుకుంటున్నాయి. మీనాయన చదువుకొన్నవాళ్ళకంటె కూడ ప్రేమించి పెళ్ళాడే వాళ్ళని గురించి చాల హీనంగా రాశాడు" అంది తరళాక్షి.

"ఉన్న సంగతి చెప్పేడు. అటువంటివి బోలెడన్ని చూస్తున్నాం. అవన్నీ సబ్బు బుడగలలాగు పేలిపోతున్నాయి."

"వారిది ప్రేమవివాహం కాదు. తుచ్ఛమైన ఐహిక ప్రేమ. పెద్దమనిషి వేషం వేసుకొన్న దొంగలెట్లాగో వాళ్లూ అట్లాగే!"

"మనది ఆ మోస్తరుగా ఉండకుండా ఉంటే నాకదిచాలు?" అన్నాడు ప్రేమికుడు.

"మనది సంపూర్ణప్రేమ" అంటూ ఆమె బుజంమీద చేతులు వేసింది.

"అందుచేతనే నేను సందేహించడం లేదు."

"మీ నాన్నకి జవాబు రాయాలి కాబోలు?"

"ఘాటుగా రాస్తాను!"

"ఆయన పేరు చెప్పితే నాకు ఒళ్లు మండిపోతూంది అబ్బా!" అంది తరళాక్షి.

ఇద్దరూ కొంతసేపు ఊరుకొన్నారు.

"అన్నట్టు రేపు నీకు ఏవార్డులో పరిశీలనకు వేసేరు" అని ప్రశ్నించేడు జానకీప్రియమూర్తి.

"మన ఇద్దరికీ ఒక తుఖీలోనే పడింది!"

"అట్లాగా! బలే!" అని అతను పొంగిపోయేడు.

"మళ్ళీ రేపు ఆసుపత్రిలో కలుసుకొందాం!" అంది తరళాక్షి.

హస్తచాలనం తర్వాత ఆమె తన బసకి వెళ్లింది.

మర్నాటిపొద్దున్న ఆ ప్రేమజంట కింగ్ జార్జి హాస్పిటలులో కలుసుకొన్నారు. జానకీప్రియమూర్తి సూటు, హేటు, బూటు, మెడలో స్టెతస్కోపు ప్రేలాడుతూ తయారయేడు. తరళాక్షి వాలుజడ, పల్చని తెల్లని చీర, పువ్వుల పట్టురవిక తొడిగి చేతిలో స్టెతస్కోపు పట్టుకొంది. అధ్యాపకుడి వెంట గుంపుగా విద్యార్థులు బయలుదేరేరు. ప్రతిమంచందగ్గిర ఆగి, రోగిని పరీక్షచేస్తున్నారు. అతని తలదగ్గిర కాళ్లవైపు ఉన్న బోర్డులు చూస్తున్నారు. అధ్యాపకుడు చెప్పిన వాటిని వింటున్నారు. శ్రద్ధగా నోట్సు రాసుకుంటున్నారు. ఆ జంటయొక్క ప్రేమకలాపాలెరిగిన విద్యార్థులు జానకీప్రియమూర్తిని, విద్యార్థినులు తరళాక్షిని చాటుగా గేలిచేస్తున్నారు. పన్నెండు గంటలవరకు ఆసుపత్రిలోకి తిరిగి, కొందరు హాస్టలుకి కొందరు ఇళ్ళకే వెళ్లిపోయారు.

ఒకరోజు సాయంత్రం ముందే ఏర్పాటు చేసుకొని, తరళాక్షి జానకీప్రియమూర్తులు సముద్రతీరానికి షికారుకి వెళ్లేరు. ఏవో ఖులాసా కబుర్లు చెప్పుకున్న తర్వాత జానకీప్రియమూర్తి "మానవ జీవితం కొన్ని ఆదర్శాలను అనుసరించడానికే!" అన్నాడు.

"ఆమాట నిజమే!" అంది ప్రియురాలు.

"చదువు అయిపోయిన తర్వాత ఏదో ఒక పల్లెటూరికి వెళ్ళి అక్కడ ప్రాక్టీసు పెడతాను".

"ఛఛ అదేమిటది!" అంది ఆశ్చర్యంతో.

"అదేమిటంటే, నీ ఉద్దేశమేమిటే?"

"ఇంత చదువు చదువుకొని అదా చెయ్యడం!" అంది.

"పట్టణంలో వైద్యం చెయ్యడానికి బోలెడు మంది డాక్టర్లు ఉన్నారు. పాపం పల్లెటూళ్ళలో వైద్యసౌకర్యం చాలా తక్కువ!"

"వాళ్ళ కర్మ వాళ్లది ఎవరేమిచేస్తారు!" అంది.

"మనం అక్కడికి పోయి ప్రాక్టీసు చేస్తే వాళ్ళకి సాయపడ్డవాళ్ళ మవుతాం" అన్నాడు.

"అనంతా నిజమే! కాని ఆ దిక్కుమాలిన పల్లెటూళ్లలో ఎవరుండగలరు అబ్బా! ఆఖరికి ఒక్క రోడ్డేనా ఉండదు"

"అనేక అసౌకర్యాల పాలయిన గ్రామీణులకు మనం కొంచెం ఉపకారం చేసినా అది సాంఘిక సేవే!"

"అది సరేగాని ఇంత చదువు చదువుకొని అనాగరికపు పల్లెటూళ్ళలో అవస్థలు పడమని దేవుడు మన నుదుట రాసిపడేశాడు."

"నాగరిక మంటే సాంఘికసేవ కాదనా నీ ఉద్దేశం!"

"మనం పట్టణంలో ఉండిమట్టుకు ఇక్కడికి వచ్చే గ్రామస్థులకు వైద్య సేవ చెయ్యరాదా!"

"పట్టణంలో నువ్వే చెయ్యాలన్నమాటేమిటి! డబ్బు పారేస్తే చేసేవాళ్లు బోలెడు మందున్నారు."

"అది సరేకాని ఆ దిక్కుమాలిన పల్లెటూళ్ళలో అసలు ఎలాగ వెళ్ళగలం! ఒక ఎలెక్ట్రిసిటీయా, రేడియోలా, క్లబ్బులా, మోటారుకార్లా, సభలా, కాఫీహోటళ్లా, టీపార్టీలా, ఫొటోలా, విందులా—"

"ఆగు, ఆగు"

"నేను చెప్పేది పూర్తికానియ్యి!"

"అది ఇంతటిలో అవదు! నువ్వు చెప్పిన దానిని బట్టి మిగతా దానినికూడ ఊహించు

…కొని సమాధాన మిస్తాను.

అన్నీ ఉన్నచోట మన ప్రతాపం చూపించ నవసరంలేదు. లేనిచోటే మన సేవ అవసరం. మనం కూడా అవస్థలు పడుతూ లేనివాళ్లకి చేసిన సేవే సేవ. 'అజ్ఞాన నారాయణుడి, దరిద్ర నారాయణుడి సేవే ఉత్తమ సేవ! మానవ సేవే మాధవ సేవ!"

"ఏమో! నావల్లకాదబ్బా!"

"నీకు కుదరకపోవచ్చు కాని నాకు తప్పదు. నా ఆదర్శమే అది. మన దేశ పురోభివృద్ధికి అట్టి సేవ అత్యావసరం!" అని జానకిప్రియమూర్తి నిర్మొహమాటంగా అన్నాడు.

ఆశ్చర్యపోతూ కూర్చుంది తరళాక్షి. ★

# సౌందర్యమునకు ఆధారము మీ చర్మము



## మీ ముఖ సౌందర్యమును కాపాడుకొనండి

ఎంత మరియు దుమ్ము, వేడిమి మరియు చలి, తేమ మరియు పొడిదనము . . . ఇవి మీ చర్మమునకు శత్రువులు. హిమాలయా బుకే స్నోతో మీ ముఖ సౌందర్యమును కాపాడుకొనండి. ఇది విపరీత శీతోష్ణ స్థితులను ఎదుర్కొనుటకై ప్రత్యేకముగా తయారుచేయబడినది. పౌడరును రాసుకొనుటకు ముందర వాడుటకు ఇది దివ్యమైనది. మరియు అది మీ చర్మమునకు క్రొత్తదనమును మరియు ప్రకాశత్వమును తెచ్చును. మరియు దాని సువాసనను మీరు మెచ్చుకొంటారు.






# హిమాలయా బుకే స్నో

మరియొక దివ్యమైన **ఇరాస్మిక్** సరకు

HBS. 10-X52 TL

ఇరాస్మిక్ కంపెని లిమిటెడ్, లండన్, ఇంగ్లండ్‌వారి తరపున ఇండియాలో తయారుచేయబడినది



# విజ్ఞానవీధులు

"డాక్టర్"



## 142. దిక్సూచి ఉత్తర దక్షిణాలు చూపిస్తుందేం?

పటములో చూపించినట్లు ఒక అయస్కాంతపు కడ్డీని దారముతో వేలాడ తీయండి. అప్పుడు ఆకడ్డీ కొసలు ఒకటి ఉత్తరాన్ని యింకొకటి దక్షిణాన్ని చూపిస్తుంది. ఇది మన అనుభవము. ఉత్తరం అంటే దిక్కు. ఫలానా దిక్కు ఉత్తరం అని తెలుసుకోడానికి సూర్యుడు ఏదిక్కున ఉదయిస్తాడో తెలిస్తే చాలును. అయస్కాంతము అక్కరలేదు. వేలాడదీయబడిన అయస్కాంతపు రెండు కొసలలో ఉత్తరపు వైపుచూపించే కొసకి ఉత్తరధ్రువ




ముని, దక్షిణమువైపు చూపించే కొసకి దక్షిణ ధ్రువమనీ వైజ్ఞానికులు పేరుపెట్టుకున్నారు. ఇలా పేర్లు పెట్టుకున్న తర్వాత పటంలో చూపించబడినట్లు వేలాడదీయబడిన అయస్కాంతముయొక్క ఉత్తరధ్రువము వద్దకు మరియొక అయస్కాంతపు కడ్డీయొక్క ఉత్తరధ్రువమును తెచ్చి వేలాడదీయబడిన అయస్కాంతపు ఉత్తరధ్రువము ఆగంతుక ఉత్తర ధ్రువమును వికర్షించి బాణముచూపే వైపు తిరిగిపోవడం గమనించారు. ఉత్తరధ్రువమువద్దకు దక్షిణ ధ్రువము తెచ్చినప్పుడు మాత్రము ఆరెండూ ఆకర్షించుకుని చేరుకున్నట్టు గుర్తించారు. ఈ రెండు ప్రయోగాలనుబట్టి సజాతీయ అయస్కాంత ధ్రువములు వికర్షించుకొనునవనీ విజాతీయ అయస్కాంత ధ్రువములు ఆకర్షించుకొనుననీ, సూత్రీకరించుకున్నారు.

ఇప్పుడు ఉత్తర ధ్రువమేదో దక్షిణ ధ్రువమేదో తెలియని ఒక అయస్కాంతపు కడ్డీయొక్క ఫలాని కొస ఫలాని ధ్రువమని తెలుసుకోడానికి పై సూత్రము నుపయోగించుకున్నారు. ఆసూత్ర ముపయోగిస్తే ధ్రువాల్ని ఫలానా అని కనుక్కోడానికి ప్రతీ అయస్కాంతాన్నీ వేలాడతీసుకో నక్కరలేదు. ఒక్క అయస్కాంతమును మాత్రం వేలాడదీసి దాని ఉత్తర ధ్రువము దగ్గరకు తబిస్తే తెలియని అయస్కాంతపు కొసను తీసుకొస్తే వేలాడదీయబడిన అయస్కాంతపు ఉత్తరధ్రువము దాని దగ్గరకువచ్చిన కొస వైపు ఆకర్షించబడితే ఈకొస ఈ అయస్కాంతానికి దక్షిణధ్రువము అన్నమాట. కాదామరి? విజాతీయ ధ్రువములు ఆకర్షించుకోవాలాయెను. ఇవి ఆకర్షించుకున్నాయా వీటిలో ఒకటి ఉత్తర ధ్రువమూ. కనక (తెలియని) రెండోది దక్షిణధ్రువమే అవాలి. అంటే ఏమన్నమాటా? వేలాడదీయబడిన అయస్కాంతపు ఉత్తరధ్రువము ఆగంతుకమైన దక్షిణ ధ్రువము వైపు తిరుగుతుందన్నమాట.

ఇప్పుడు మళ్ళీ మొదటికి వద్దాం. ఒక అయస్కాంతపు కడ్డీని వేలాడదీశాం. దాని రెండు కొసలలో ఒక కొస ఉత్తరమువైపు తిరిగింది. భూమిమీద ఏ దేశములోనైనాసరే ఆ కొస ఉత్తరం వైపే తిరుగుతుంది. ఇందాకా నిర్ణయించిన సూత్రము ప్రకారము అయస్కాంతపు ఉత్తరధ్రువము ఒకవైపు తిరగాలంటే ఆ వైపున ఏ ధ్రువము వుండాలి? దక్షిణధ్రువము కాదూ! అంటే ఉత్తరపు దిశను భూమిలో అయస్కాంతము యొక్క దక్షిణ ధ్రువమువంటి పెద్దధ్రువము వున్నదన్నమాట. అందుకే మనం వేలాడదీసిన అయస్కాంతపు ఉత్తరధ్రువము దాని వైపు తిరిగినది. ఈరీతిగానే వేలాడదీసిన అయస్కాంతపు దక్షిణధ్రువము, దక్షిణ దిశయందు భూమిలో, అయస్కాంతపు ఉత్తర ధ్రువమువంటి పెద్దధ్రువము ఉండడమువల్లనే అటు తిరుగుతున్నదని శాస్త్రజ్ఞులు వూహించారు.

భూగర్భములో ఉత్తర దక్షిణాలకు పెద్ద అయస్కాంతము దాచుకొని వున్నది. భూమిమీద వేలాడదీసిన చిన్న అయస్కాంతము లన్నీ దీని ఆకర్షణవల్లనే ఉత్తర దక్షిణాలు చూపిస్తున్నాయి.

## 143. కృతక సూర్యరశ్మివల్ల మొక్కలు పెరుగునా?

"చెట్లు వెలుతురు సాయమువల్లనేకదా పిండిపదార్థములు తయారుచేసుకుంటాయి? అయితే రాత్రివేళ ఎక్కువ కాంతిగల దీపా లుపయోగించి, చెట్లచేత పిండిపదార్థాలు తయారుచేయించవచ్చునా?" అని విశాఖపట్నం నుంచి బొడ్డు సుబ్బారావు గారు అడుగుతున్నారు.

చక్కని ప్రశ్న. వెలుతురే కిరణజన్యసంయోగక్రియకి కారణమైతే కృతకమైన వెలుతురువల్ల ఆక్రియను జరిపించి మొక్కలు పిండిపదార్థమును తయారు చేసుకొనేటట్లు చెయ్యలేమా? అని వారి సందేహము. తప్పకుండా చేసుకోవచ్చును. ఒక మొక్కను చీకటిగదిలో మట్టిపోసి, పాతి నీరుపోసినచో అది తెల్లగా పాలిపోవును. ఈ మొక్కకి, కృతకసూర్యరశ్మిని — సూర్యరశ్మిలో ఉన్న భాగాలూ కలిసిన వెలుతురును—అందజేస్తే అది మామూలుగా పెరుగుతుంది. సందేహములేదు. ఏదో దీపాన్ని వెలిగించితే దాని వెలుతురులో సూర్యరశ్మియొక్క సుగుణములు ఎలాగు ఉంటాయి? సూర్యరశ్మిని, మొక్కకి అద్దాలవల్ల అందించినా మొక్క సవ్యంగానే పెరుగుతూంది. పగలంతా చీకటిలో

ఉంచి, రాత్రిపూట కృతక సూర్యరశ్మిని మొక్కపై ప్రసరింపజేసినా ఆ మొక్క [illegible]ంగానే పెరుగుతుంది. కాని పగలంతా సూర్యరశ్మి సహాయంవల్ల పిండిపదార్థాన్ని తయారుచేసుకుని, రాత్రి, విశ్రాంతీ నిద్రా కోరే మొక్కకి ఆ విశ్రాంతి అందించక, రాత్రికూడా వెలుతురుని అందిస్తే మొక్క అలిసి బలహీనమేనా అవుతుందీ, విశ్రాంతి లేక వాడిపోనేనా వాడిపోతుంది. కాని కృతకసాధనాలవల్ల మొక్కలకి పగలు రాత్రిగానూ రాత్రి పగలుగానూ మార్చితే మొక్కల పెరుగుదలలో పెద్ద మార్పుండదు.

వెలుతురు, మొక్కలు ఆహారపదార్థాలు తయారుచేసుకోడానికి మాత్రమే కాక కొన్ని జంగమప్రాణులు సంతానోత్పత్తి చేసుకోడానికి కూడా పనికివస్తుంది. కొన్ని జాతుల పక్షులు శీతలమండలాల్లో శీతకాలము వచ్చినప్పుడు వేడికోసమూ వెలుతురుకోసమూ వేలకొద్దీ మైళ్లు ఉష్ణమండలాలకి ఎగిరి అక్కడ గుడ్లుపెట్టి పొదుగుతాయి. ఈ సంగతిని గమనించిన శాస్త్రజ్ఞులు, శీతలదేశములో ఉన్న రోజులలో ఈ పిట్టల జననేంద్రియాలకు వెలుతురూ వేడిమీ తగిలే ఏర్పాటుచేశారు. అలాటి 'చికిత్స' పొందిన పిట్టలు దేశాంతరగమనానికి బయల్దేరలేదు! నదికి ఎదురెక్కి, నది ఉత్పత్తిస్థానముదాకా వలసవెళ్లే చేపలమీద కూడా ఈ ప్రయోగము ఫలించింది! ఈ ప్రయోగాలవల్ల పక్షుల దేశాంతరగమనానికి ఇది ఒక కారణమని కనిపెట్టారు.

శీతలదేశాల చిత్రోద్యానవనాల్లో, ఉష్ణమండలాలలో పెరిగే అరటీ, కొబ్బరీ, మామిడిమొక్కలు పెంచి అక్కడి వారికి పంచడానికి, వాటిని గాజుటెంట్లలో పెట్టి, మంచూ, శీతగాలీ తగలకుండా చేయడమేకాక, సీసపుగొట్టాలలోంచి ఆవిరిని పంపి, ఆ మొక్కలచుట్టూ వున్న గాలిని వెచ్చబెట్టుతారు కూడాను. అప్పుడా మొక్కలు చక్కగా పెరుగుతాయి.

# చిట్టి ప్రశ్నలకు జవాబులు

—భూమికీ సూర్యునికీ వైషమ్యాలున్నాయా అంటారా? ఒకరకంగా ఉన్నాయనవచ్చునేమో. భూమి సూర్యుడినుంచి [illegible]పోయింది. భూమి అంతరాళములో ఎటో [illegible]ళ్ళిపోబోతూంటే సూర్యబింబము దానిని ఆకర్షించి పట్టింది. ఈ రెండు శక్తుల ఫలితముగా భూమి సూర్యుడిచుట్టూ తిరుగుతోంది.

—విపరీతపు బిడ్డలు తలిదండ్రుల రోగాల కారణమువల్ల కలగవచ్చును. లేదా పిండవృద్ధిలో అస్వాభావికపు కదలికలవల్ల కలగవచ్చును. పైపెదవి చీలినట్టున్న బిడ్డలకు, అందరికీ కలిసిపోయినట్టుగా పైపెదవి ఏ కదలికవల్లనో, ఒత్తిడివల్లనో కలవకుండా మిగిలిపోతుంది. బిడ్డ శిరస్సు విపరీతముగా పెరిగిపోవడము హైడ్రో సెఫాలస్ అనే వ్యాధివల్ల.

—మేఘాలంటే నీటి ఆవిరి. నీటి ఆవిరి గాలికంటె తేలిక. అందువల్ల పైకి లేచిపోయి, గాలి పలచబడి, సరికిసరా తీసుకుంటే తనంత బరువే ఉండే సాంద్రతకి వచ్చినచోట నిల్చిపోతుంది. పీకిన దూది పింజలాగ వుండే మేఘాలు సుమారు పది వేల అడుగుల ఎత్తువరకూ ఉంటాయి భాస్కరరావుగారూ.

—మీ వ్రేలికున్న ఉంగరము తీసి, అది ఇన్నాళ్ళూ వుండినచోటు పరిశీలించండి. అరిగినట్టు కనపడుతుంది కాదూ? ఉంగరపు రాపిడికి అరిగింది. అలాగే వ్రేలిరాపిడికి ఉంగరమూ అరుగుతుంది. చీమలు పాకితే రాళ్లరుగుతాయి. నీరు పారడమువల్ల కొలరెడోలో కొండలు బ్రహ్మాండమైన లోయగా కోసుకుపోయాయి.

—టెలిగ్రాపు స్తంభాలమోతకి తీగెలు కంపించడము ఒక్కటే కారణముకాదు. తీగెలను రాచుకుంటూ విసిరేగాలి కూడా స్వరాలు వినిపించగలదు. తీగె ఉరవ ఎక్కువైనా, గాలివేగము తక్కువైనా, ఈస్వరముయొక్క స్థాయి తగ్గుతుంది. ఈ స్వరము తీగెని ఝల్లుమనిపించగలిగినదైతే నాదము బలమౌతుంది. ఇదే టెలిగ్రాపు స్తంభాలమోత.

—లేవు. ప్రాచీనకాలములో నేటిగడియారాల వంటివి లేవు.

—'పాలు వేడెక్కినవి' అంటే కుండ యొక్క అడుగు వేడెక్కి, పాలను వెచ్చబెట్టిన దన్నమాట. ఇక, కుండ అంచు అంత వేడిగానూ వుండకపోడానికి కారణము, వేడిమి కుండద్వారా లోహములోనుంచి లాగ వ్యాపించలేకపోవడమే. పెంకూ, ఇటికా, కుండా లోహాలంత బాగా వేడిమిని తమలోనుంచి సాగిపోనివ్వవు. అందువల్ల వేడిపాలు వున్నకుండని పట్టుకున్నా చేతికి వేడి అంతగా తగలదు.

—మెరుపుమెరిస్తే లాభమే. మనమీదికి మెరవకుండా ఉండాలి. మెఱుపులవల్ల గాలిలోని నత్రజనీ ఆమ్లజనీ రాసాయనికముగా మేళవించి వానతో కలిసి దిగిపోతాయి. భూసారము ఎక్కువచేసే నైట్రేటులు ఇలాగే ఏర్పడతాయి భూమిలో. అమ్మోనియాకూడా ఏర్పడి వాన నీటితో దిగి భూమిని సారవంతము చేస్తుంది.

—పిడుగునించి తప్పించుకోడానికి పిడుగుతీగ అమర్చిన భవనంలో దూరడము మెరుగు. పొడుగాటిచెట్లకిందా, ఒంటిగా వున్న చెట్టుకిందా, కొండకొమ్మనా, ఉండడము అపాయము. బట్టలారవేసుకునేందుకు ఇంటిమీదనుంచి చెట్టుకొమ్మలకి కట్టేతీగలుకూడా ఒకొక్కప్పుడు అపాయము తెస్తాయి. తీగతో అల్లిన దడికూడా అపాయకారియే.

—మనస్సు నిలకడలేకుండా క్షణక్షణమూ మారిపోడానికి ఒక కారణము విశ్రాంతి లేకపోడము. హాయిగా నిద్రపోయిన తర్వాత మనస్సు నిలకడగానే వుంటుంది. దేవుడు గుళ్లో వున్నప్పుడు నిలకడలేకపోడము దేవుడుమీద నమ్మకము లేకపోతేనే. భోజనము దగ్గర నిలకడలేకపోడము ఆ భోజనముకంటె ఇష్టమైందాన్ని గురించి ఆలోచించడము. క్లాసులో నిలకడలేకపోడము మేష్టరు చెప్పినది అర్థము కాకపోతేనూ, పనిలో నిలకడలేకపోడము చాతకాకపోతేనూ. చదువులో నిలకడలేకపోడము అర్థము కాకపోడమువల్ల, వ్యాపారంలో నిలకడలేకపోడము అత్యాశవల్ల. దేనిలోనూ ఎప్పుడూ నిలకడలేకపోడము మతిచాంచల్యమువల్ల.

—'కీచురాళ్లు' కీటకాలే. పెద్దరకపు చిమ్మటలలాగ కనపడతాయి. వాటిరంగు నలుపుచేరిన బూడిద వర్ణము. పగలుకూడా జంతుసంచారము లేనిచోట చెట్లమీద ఈ కీటకాలు వాలి ఉండి 'క్రీ' మని చప్పుడు చేస్తాయి. తమ కాళ్ళపక్కన ఉండే అదనపు రెక్కలవంటి అంగాలను కంపింపచెయ్యడమువల్ల ఆ చప్పుడు కలుగుతుంది.




—ఒక ఫర్లాంగు దూరములోనున్న రెండు చోట్లనుంచి, ఒక మేఘముయొక్క కొన ఏ కోణములో ఉన్నదో గుర్తిస్తారు. పటములో 'మేకల' 'మేఖల' అన్నవే ఆ కోణాలు. ఇప్పుడు 'కఖ' అన్న భుజమూ, ఆ రెండుకోణాలూ ఉపయోగించి 'మేకఖ' అన్న త్రిభుజము నిర్మించి 'మేర' అనే మేఘపు ఎత్తు లెక్కిస్తారు.





"...కన్నులార సేవించి కమ్మని ఫలముల నొసంగి
తనువు పులకరించి పాదయుగము మ్రొక్కి—
ఇనకుల పతిసముఖంబున పునరావృత్తి రహితపద
మును నొందిన......"

చిత్రకారుడు :

**శ్రీ జి. శేషయ్య**

(తెనాలి.)



ఫాలనేత్రుడు (జావా శిల్పానికి ప్రతికృతి)

# బొమ్మరిల్లు

## ఈర్ష్య

### శ్రీ ద్రోణాదుల శ్రీహరిరావు

ఇరుగూ పొరుగూ
ఉన్నారు
ఎడగా పెడగా
ఉంటారు
ఇరుగింటాయన
ఎల్లయ్య
పొరుగింటాయన
పుల్లయ్య
ఇద్దరి మధ్యన
పచ్చని గడ్డి
భగ్గునమండి
బుగ్గవుతుంది
ద్వేషం, రోషం
పెరిగాయి
పొగలై, సెగలై
రగిలాయి
"పుల్లయగాడికి
పక్షవాతమే
వస్తే, గిస్తే
బాగుండు"
"ఎల్లయగాడికి
క్షయదగ్గొస్తే
నేనూచూస్తే
బాగుండు"
అని యిద్దరు
చింతిస్తుంటారు
కారం, మిరియం
నూర్తారు
అనుకోకుండా
మంచివుపాయం
ఇద్దరి బుర్రల
మెరిసింది
బాగావుందని
మురిశారు
వడి, వడి యిద్దరు
లేచారు
చెర చెర యిద్దరు
చన్నారు
ఒకచో టిద్దరు
కలిశారు
'రుసరుస' లాడెను
ఎల్లయ్య
'బుసబుస' లాడెను
పుల్లయ్య
ఉలుకూ, పలుకూ
లేకుండా నే
దాపున కొండకు
చేరారు
ఎల్లయ క్రింద
పుల్లయ పైన
కష్టలకొద్దీ
దీక్షనుబూనీ
దేవుని ధ్యానం
చేశారు
దేవుడు భక్తికి
మెచ్చాడు
వడి, వడి, క్రిందకు
వచ్చాడు
"వత్సా భక్తికి
మెచ్చానోయ్!
కోరిన వరాలు
ఇస్తానోయ్!
అనగా, దేవుడు
ఎల్లయ్యడిగెను
"దేవా! పుల్లయ
పైనున్నాడు
వాడడిగిన
దానికి రెట్టింపు.
పుల్లయ కగపడి
దేవుం డడిగెను
వత్సా భక్తికి
మెచ్చానోయ్!
కోరిన వరాలు
ఇస్తానోయ్!
ప్రాధేయంగా
పుల్లయ్యడిగెను.
"దేవా! ఎల్లయ
కోరిం దేమిటి
దయతో ముందుగ
చెప్పండి"
"నీ వడిగిన దానికి
రెట్టింపంట
కోరే దేమిటో
కోరుము యింక"
అనగా దేవుడు...
"కన్నొకటి
నాకు పోవాలి
ఈ వరమే తప్పక
ఇవ్వాలి"
అని పుల్లయ్యడిగిన
తోడనె కన్నొ
మాయం
అయినది.
పుల్లయ కన్నొ
ఒక్కటిపోతే
ఎల్లయ కళ్ళు
రెండూ కూడా
మాయం
అయినవి.
ద్వేషం, రోషం
నవ్వేయి.



బొమ్మరిల్లు సీరియల్

అద్దెబోటులో-

# ముచ్చటగా ముగ్గురు

## (కుక్క సంగతి సరే సరి!)

ముగ్గురమూ పైపులు వెలిగించి, నిశ్శబ్ద నిశీధి లోకి చూస్తూ చాలాసేపు కూర్చుండిపోయాం. ఎల్లప్పుడూ యిలాగే పాపిష్టి ప్రపంచానికి దూరంగా మనం నలుగురమూ బ్రతుక గలిగితే ఎంత బాగుండునని జార్జిగాడు నిట్టూర్చాడు. పాపాలకీ, ప్రలోభాలకీ ఆటపట్టయిన యీ మానవ సంఘాలకి దూరంగాపోయి ఎక్కడో యిలాంటి ప్రశాంతమైన చోట స్థావరం ఏర్పరచుకొని, సంతతమూ సదాలోచనలతో జీవితశేషం గడపాలన్నాడు. నేను కూడా ఎప్పుడూ మనసులో యిదేవిధంగా అనుకొంటూ వుంటానని చెప్పాను. జనవాసాలకి దూరంగా వుండే ఏ లంకకో మేము నలుగురమూ వలసపోయే విషయమై మాలో మేము చర్చించుకొన్నాం.

లంకలు చాలా తేమగావుంటాయని ఎవరో తనతో పదేపదే అంటూవున్నట్లు హారిస్సు బయట పెట్టాడు. ఎక్కడికక్కడ నీటిపారుదల సదుపాయాలు సరిగా ఏర్పాటైవున్న లంకలో అయితే, తేమవుండదని జార్జి సవరణ చేశాడు.

మా సంభాషణలు ఆదశకు వచ్చేసరికి, జార్జిగాడికి వాళ్ళనాన్నగారిని గూర్చిన చమత్కారమొకటి ఎందుకో జ్ఞాపకంవచ్చింది. వాడు అదంతా మాకు యిలా చెప్పుకొచ్చాడు.

జార్జిగాడి నాన్నగారు ఏదో పనిమీద ఆయన స్నేహితుడొకడితో కలిసి 'వేల్సు' ప్రాంతంలో పర్యటన చేస్తూ, ఒకనాటి రాత్రి ఏదో దారిప్రక్కన వుండే హోటల్‌లో బసచేశారట. ఆహోటల్‌లో అప్పటికే చాలామంది బాటసారులు చేరారు. నలుగురూ చేరి ఏవో ఆకబుర్లూ, యీకబురూ చెప్పుకొంటూ రాత్రి చాలా పొద్దుపోయేదాకా గడిపేశారు. తరువాత ఎప్పటికో అందరూ కూడబలుక్కొని పడుకోవటానికి లేచారు. అప్పటివరకు నడిచిన సంభాషణల ధోరణి సరదాగా వున్నదేమో, జార్జిగాడి నాన్నా, ఆయన మిత్రుడుకూడా మంచి ఖుషీగా వున్నారు. ఇద్దరూ తాము పడుకోవలసిన గదిలోకి కొవ్వొవత్తి దీపం పట్టుకొని వెళ్ళారు. ఆగదిలో వీళ్ళకి చెరోమంచం ఏర్పాటైవుంది. ఇద్దరూ తీరా గదిలోకి పోగానే కొవ్వొత్తి దీపం ఎందుచేతనో ఆరిపోయింది. కన్ను పొడుచుకొన్నా కనిపించని ఆచీకట్లోనే చెరొక మూలకిపోయి బట్టలు విప్పేసి మంచంకోసం తడుముకొంటూ యిద్దరూ ముందుకి వచ్చారు. ఇద్దరి చేతులకి మంచంపట్టెలు తగిలాయి. ఇద్దరూ పడుకొన్నారు. కాని ఆ పడుకోవటం అనేది వేరు వేరు మంచాలమీద కాక, యిద్దరూ ఒకేమంచం మీద,

మూలం :
జెరోమ్ కె. జెరోమ్



అనువాదం :
విశ్వాత్ముల నరసింహమూర్తి

#  ముచ్చటగా ముగ్గురు 

ఒకరి కాళ్లవైపుకి యింకొకళ్ళ తల వచ్చేలా పెట్టుకు పడుకొన్నారు.

ఒకక్షణం సేపు నిశ్శబ్దంగా గడిచింది.

"ఒరేయ్?" అన్నాడు జార్జి తండ్రి, సన్నగా మూలుగుతున్నట్లు.

"ఏమిట్రా?" అన్నాడు ఆయన మిత్రుడు, బిక్కచచ్చిన కంఠస్వరంతో.

"నాపక్కలో ఎవడో వున్నట్లున్నాడురా: వాడికాళ్లు నాతలకి తగులుతున్నాయ్!" అన్నాడు జార్జి తండ్రి, రహస్యంగా.

"అరె! చిత్రంగా వుందే!! నా పక్కలోనూ ఎవడో వున్నాడురా!" అన్నాడు ఆయన మిత్రుడు, వులిక్కిపడి.

"ఏం చేద్దాంరా యిప్పుడు?"

"చాచిపెట్టి తన్నేద్దామా అని చూస్తు న్నానురా!"

"నేనుకూడా అదే చేద్దామనుకొంటున్నాను!!" అన్నాడు జార్జి తండ్రి, రొమ్ములు విరుచుకొంటూ.

ఇద్దరూ 'రెడీ' అంటే 'రెడీ' అనుకొని ఒక్కసారిగా ఎగిరి ఒకరికాళ్లు ఒకరు పుచ్చుకొని గుంజుకోవటం మొదలుపెట్టారు. మంచం కటకటలాడిపోయింది. కొంతసేపు గడిచాక "నీ పక్కలో వాణ్ణి ఏం చేశావురా?" అని జార్జితండ్రి తన మిత్రుణ్ణి హెచ్చరించాడు.

"నన్నే వాడు తన్నేసేటట్టున్నాడురా" అన్నాడు ఆ మిత్రుడు, వణుకిపోతున్న కంఠంతో.

"నాపనీ అలానే వుందిరా!" అని జార్జి తండ్రి వంత కలిపాడు. "కాకపోయినా—యీ హోటల్ అంత మంచిదికాదల్లే వుందిరా!" అన్నాడు మిత్రుడు.

కథ యింతవరకు వచ్చేసరికి. హారిస్సు కల్పించుకొని 'ఆహోటల్ పేరేమిటో జ్ఞాపకంవుందా?' అని జార్జిని అడిగాడు. దానిపేరు 'పిగ్ అండ్ విసిల్' అని చెప్పుతూ 'దాంతో నీకేంపని పడింద'ని జార్జి హారిస్సుని అడిగాడు.

"ఎబ్బే, ఏమీలేదు. ఆ హోటల్ కాదు!" అన్నాడు హారిస్సు, బుర్ర అడ్డంగా ఆడిస్తూ. 'ఆసంగతేమిటో చెప్పుతావా లేదా' అని జార్జి పట్టుబట్టాడు.

మరేమీ లేదంటూనే, తన తండ్రి హాయాంలోనూ యిల్లాంటి సంఘటనే యింకేదో పల్లెటూరి హోటల్లో జరిగిందనీ, ఆహోటలూ యీ హోటలూ ఒకటే అయివుంటుందేమోనని అడిగాననీ హారిస్సు చెప్పాడు.

అప్పటికి రాత్రి పదిఅయింది ఇక పడుకొందామనుకొన్నాం. పగలంతా అలిసివున్న కారణంచేత నాకు చప్పునే నిద్ర పట్టుతుందనుకొన్నాను కాని, ఎంతకీ నిద్రపట్టలేదు. మామూలుగా యింట్లో పడుకొన్నప్పుడు అయితే దిండుమీద అలా తల పూర్తిగా వాల్చి, కన్ను పొంతం ముయ్యకముందే నిద్ర పట్టేసేది. గుట్టిగా ఒక్క కునుకు తీసే లోగానే ప్రొద్దున ఎనిమిదిగంట కొట్టుతున్నట్లు అనిపించేది. పడవలో ముడుచుకు పడుకోవటం చాలా వుత్తుకష్టంగా వుంది. (ఒక చెక్కకిందికి కాళ్లుపెట్టి యింకో చెక్కమీద తలపెట్టుకు పడుకొన్నాను ఆ భంగిమలో వుండగా నిద్రపోవటం ఎవరితరం!) అసలే పక్క కుదరక చస్తుంటే చెవికింద గలగలమంటూ నదీ జలం చేసే చప్పుడు ఒకటి.

చివరికెప్పటికో ఒకటి రెండు గంటలసేపు నిద్రపోయాను. ఆ నిద్ర అయినా ఆదమరచిన నిద్ర కాదు. పడవలో రాత్రికి రాత్రి పుట్టుకొచ్చిన భాగం ఏదో విడవకుండా నా వెన్నముకని తొలిచేసున్నట్లు అనిపించింది. అయినా లేవకుండా అలాగే పడుకొన్నాను. అంతలో ఒక పీడకల: నేనొక సావరిన్‌ని మింగేసినట్లు, ఆదిక్కుమాలిన సావరిన్ కోసం ఎవళ్లో నానడ్డిమీద బరమాతో రంధ్రం పొడవటం మొదలుపెట్టినట్లు. ఇల్లాంటి రాక్షస కృత్యం చెయ్యటం తగదనీ, అనే మింగేసిన సావరిన్‌కి బదులు యింకొక సావరిన్ పైనెల ఒకటో తారీకున జీవితం రాగానే యిచ్చేస్తాననీ యిప్పటికి మాత్రం నన్ను అలా వదిలెయ్యమనీ నెత్తి నోరూ కొట్టుకు చెప్పాను. వాళ్ల ఆమాటలు వినిపించుకోలేదు. ఒకటో తారీకు దాకా

ఆగితే వడ్డీ దండగైపోతుందనీ, అంచేత యిప్పుడే నా వెన్నుకి రంధ్రం పొడిచిఅయినాసరే - ఆ నాణేన్ని బయటికి లాగాల్సిందేనని పట్టుబట్టారు. ఆ పిడి వాదం చూసి నాకు వొళ్లు మండిపోయింది. చెడా మడా తిట్టేశాను. వాళ్లు ఆ బరమాని యింకా బలంగా తిప్పారు. కెవ్వుమని కేక వేసి లేచి కూర్చున్నాను.

పడవలో గాలి అసలు ఆడటంలేదు. దాంతో ఒకటే తలనొప్పి. కాస్త అట్లా బయటికి వెళ్లి గాలిలో తిరుగుదామనిపించింది. చేతికి ఏది అందితే అదే తొడిగేసుకున్నాను. జార్జిగాడి చొక్కా, హారిస్సుగాడి బనీను మొదలుగాగల వేవో తగిలించుకొని, పడవలో నుంచి బయటకు వచ్చేశాను. గట్టుమీద పచార్లు చేయటం మొదలు పెట్టాను.

అంధకారబంధురమైన ఆ రాత్రిసమయం ఎంతో అందంగా కనిపించింది. అప్పటికప్పుడే ఆకాశంలో చంద్రుడు తారకలను వదిలేసి వెళ్లిపోయాడు. దూరంగా, ఎత్తుగా మింటిపై మినుకు మినుకు మని మెరిసే ఆ తారలు, ఏదో మనకి తెలియని భాషలో, మాట్లాడుకొంటూ వున్నట్లు నామనస్సుకి తోచింది.

## 11

ఆతరువాత మళ్లా ఎప్పుడు వచ్చి పడవలో పడుకొన్నానో నాకు అంత బాగా జ్ఞాపకం లేదుకాని, మరునాడు వుదయం ఆరుగంటలకల్లా మెళుకవ వచ్చేసింది. కళ్లు తెరిచి చూసేసరికి జార్జిగాడు కూడా మేలుకునే వున్నాడు. ఒకళ్ల నొకళ్లం చూసుకొని కూడా యిద్దరం చెరొకపక్కకి తిరిగి పడుకొన్నాం. మళ్ళీ నిద్ర పట్టుతుందేమోనని కళ్లు గట్టిగా మూశాం: కాని యిద్దరికీ నిద్దర రాలేదు. అదే, అర్జంటు అయిన పనివుండి ఆరుగంటలకల్లా నిద్ర మంచంమీదనుంచి లేవవలసిన అవసరం ఏదైనా వున్నప్పుడైతే, కళ్లు తెరిచి గడియారంకేసి చూసేలోగా మళ్లా నిద్దరొచ్చి పొద్దున్న పది దాటితేగాని మెళుకువ రాదు. అల్లాంటిది—యీవేళ యింత పొద్దున్నే మేము చేయవలసిన పని అంటూ ఏదీ లేకపోయినా, ఆరుగంటలకే మెళుకువ రావటమూ, మళ్లీ ఎంత ప్రయత్నించినా నిద్ర పట్టకపోవటమూ జరిగింది. నిద్ర పట్టించుకోవడానికి చేసిన ప్రయత్నంతో ప్రాణం విసిగిపోయి, నేనూ, జార్జి యిద్దరమూ లేచి కూర్చున్నాం.

ఇంతకంటే కూడా బాధాకరమైన అనుభవం తనకు యిటీవల కొన్ని నెలలక్రితమే జరిగిందనిఅంటూ జార్జి ఆవుదంతం చెప్పుకొచ్చాడు.

అప్పుడు తాను ఒంటరిగా ఒక యింటిలో అద్దెకు వుంటున్నాడట. గిప్పింగ్సు సతి అనే ఆవిడ ఆ యింటి యజమానురాలు. ఒకానొక సాయం కాలం జార్జిగాడి చేతి గడియారం ఎనిమిదింపావుకి ఆగిపోయిందిట: వీడు అది చూసుకోకుండా 'కీ' అయినా యివ్వకుండా గడియారాన్ని గోడకి తగిలించేసి నిద్రపోయాడట.

అప్పుడు మంచి చలికాలం. రాత్రిళ్లు ప్రొద్దు చాలా తక్కువ. దానికితోడు అప్పుడు వారం రోజులుగా ప్రతిరోజూ దట్టంగా మంచు కురుస్తోంది. అలాంటి సమయంలో వీడికి ఆ రాత్రి ఎప్పుడో మెళుకువ వచ్చి గోడకి తగిలించివున్న చేతి గడియారాన్ని తీసి టైం ఎంతైందో చూస్తే ఎనిమిదింపావు అయింది: తెల్లవారి పోయింది కాబోలు ననుకొన్నాడు.

అప్పుడే ఎనిమిదింపావు అయినందుకు విసుక్కుంటూ గడియారాన్ని విసురుగా పరుపుమీద పారేసి, గబగబా మొఖం కడుక్కుని, చన్నీళ్లతోనే గడ్డం చేసుకొని, చన్నీళ్లతోనే స్నానం చేసి, బట్టలు వేసుకొని బయలుదేరబోతూ గడియారంకేసి యింకోసారి చూశాడు. అంతకుముందే వాడా గడియారాన్ని విసురుగా పరుపుమీద పడేసివున్న కారణంచేతనో, మరెందుచేతనో, దానిముల్లు కదులుతున్నాయి. అప్పటికి ఎనిమిదీ నలభై అయింది.

వీడికి మరీ తొందర పుట్టింది. తడవకి నాలుగేసి చొప్పున మెట్లమీద నుంచీ దూకి కిందికి వెళ్లాడు. వీధితలుపు యింకా తెరవలేదు. తొమ్మిదికాబోతున్నా గిప్పింగ్సు సతి యింకా లేచి తనకి మామూలుగా యిచ్చే కాఫీ అవీ సిద్ధం చెయ్యనందుకు మనస్సులో ఆవిణ్ణి గట్టిగా తిట్టుకొంటూ వీధితలుపు తానే తీసుకు, రోడ్డు ఎక్కి పరుగు లంకించుకొన్నాడు.

బాగా రెండు ఫర్లాంగుల దూరం పరిగెత్తి, అక్కడ ఒక్కక్షణం ఆగి, నాలుగువైపులా చూశాడు. రోడ్డుమీద అట్టేజనం లేరు. షాపు ఒక్కటైనా తెరిచి లేదు. నిజానికి ఆవేళ అంతదట్టంగా మంచుపడుతున్నప్పటికీ లెక్క చెయ్యకుండా తనలాంటి వాడు

 

# ముచ్చటగా ముగ్గురు



లేచి వీధిని పడి తిరుగుతుంటే యీషాపులవాళ్లు సోమరిపోతు వెధవల్లాగా యింకా కొట్టుతలుపులు తెరవకుండా యిళ్లలో వెచ్చగా పడుకొన్నందుకు జార్జికి వొళ్లు మండుకుపోయింది.

అయినా అలాగే రోడ్డువెంట పడి 'హాల్‌బర్న్' వరకు వెళ్లాడు. ఎంతదూరం వెళ్ళినా ఒక్క యింటి కిటికీ కూడా తెరిచిలేదు: ఒక్క కొట్టు తలుపైనా తీసిలేదు: వీధిలో ఒక్కబస్సైనా తిరగటంలేదు. కొంత దూరంలో ఎవరోముగ్గురు మనుష్యులు మాత్రం కనిపించారు. వాళ్లల్లో ఒకడు పోలీసు. జార్జి మళ్లా గడియారంకేసి చూశాడు. తొమ్మిదింటికి ఐదు నిమిషాలు వుంది! వాడికి మతిపోయింది. కాసేపు ఎత్తిన కాలుదించకుండా నిలబడిపోయాడు. నాడి ఆడుతున్నదో లేదో చూసుకొన్నాడు. ముందుకు వొంగి పాదాలు మామూలుగానే వున్నాయో వెనక్కి తిరిగిపోయాయో సరి చూసుకొన్నాడు. పోలీసు దగ్గిరకి వెళ్లి 'టైం ఎంతైందని' అడిగాడు.

"టైమా? క్షణం ఓపికపట్టి విను; గంటలు విని పిస్తాయి!" అంటూ ఆ పోలీసువాడు జార్జిని ఆపాద మస్తకము అనుమానంగా చూశాడు.

ఇంతలో పక్కనున్న గడియారం ఏదో వీడిమీద దయదలిచినట్లు గంటలు కొట్టటం ప్రారంభించింది.

"మూడు గంటలే కొట్టిందేం?" అని అడిగాడు జార్జి, ఆత్మాభిమానం దెబ్బతిన్న వాడిలాగా.

"ఏం? ఎన్ని గంటలు కొట్టాలంటావ్?"

"తొమ్మిది!" జార్జి తన గడియారాన్ని పోలీసుకి చూపించాడు.

"ఎక్కడ బాబూ నువ్వు వుండేది?" పోలీసు వెటకారంగా అడిగాడు. జార్జి తన అడ్రసు చెప్పాడు.

"ఓహో! అలాగా: అయితే నామాట విని గుట్టు చప్పుడు కాకుండా వచ్చినదారినే వెళ్లి, ఆదిక్కుమాలిన గడియారాన్ని దాచెయ్. మళ్లా జన్మలో దీన్ని ఎవరికంటా పడనియ్యకు!" అన్నాడు పోలీసు.

ఆయోమయస్థితిలో జార్జిగాడు యింటిముఖం పట్టాడు.

ఇంట్లో అడుగు పెట్టేముందు, బట్టలు మార్చుకొని కాస్సేపు పడుకొందామనుకొన్నాడు. కాని తీరా గుమ్మంలో కాలుపెట్టేక, యిప్పుడీ బట్టలన్నీ విప్పి మళ్ళీ కట్టటం ఎవడితరమనిపించి, లాంతరు వెలిగించి చదరంగం బల్ల పట్టుకొచ్చుకొని ఒంటరిగా ఒక ఆట ఆడాడు. అదీ విసుగువేసింది. ఏదో గ్రంథరాజం విప్పి చదవబోయాడు. ఊహు! అదీ సాగలేదు ఇలా కాదని లేచి ఓవర్ కోట్ తొడుక్కొని మళ్ళీ వీధిన పడ్డాడు; కాస్సేపు అల్లా షికారుగా తిరిగివద్దామని.

బజారుల్లో ఎక్కడా జనసంచారంలేదు. వీడు ఒక్కడే నిశాచరుడిలా తిరుగుతున్నాడు. దారిలో ఎదురైన ప్రతిపోలీసూ వీడివంక అదోకమాదిరిగా చూడటం మొదలుపెట్టాడు. కనిపించిన ప్రతి పోలీసూ వీడివంక అలా చూస్తుండేసరికి, ఒకదశకు వచ్చాక, జార్జిగాడికి తాను నిజంగా ఏదో తప్పుడుపని చేసి వుంటానేమోననే అనుమానం తగిలి, పోలీసులు అంత దూరంలో వున్నారనగా వీడిక్కడే పక్కసందుల్లోకి తప్పుకోవటం మొదలుపెట్టాడు. వీడు యిల్లా మాటి మాటికీ పక్కసందుల్లోకి దూరుతూ వుండటం చూసి పోలీసుల అనుమానం యింకా గట్టిపడింది. మళ్ళీ వాడు సందులోకి దూరాక నలుగురు పోలీసులు పోగై "ఇక్కడ ఏం చేస్తున్నావ"ని వీణ్ణి నిలదీసి అడిగారు.

వీడు నీళ్లు నములుతూ "ఏమీ లేదు: వూరికే షికారుకెళ్తున్నా" నని సమాధానం చెప్పాడు. గంట చూడపోతే తెల్లవారుఝాము నాలుగే అయింది. పోలీసులు వీడిమాటలు అసలే నమ్మలేక పోయారు. మఫ్టీలోవున్న సి. ఐ. డి. పోలీసులు వీడి వెనకాలే వీడియింటిదాకా అనుసరించారు. వీడు జేబుల్లోంచి తాళంచెవుల గుత్తితీసి తలుపు తెరుచుకొని లోపలికి పోవటం చూసి కూడా, వాళ్లు అక్కణ్నుంచీ కదలకుండా ఆ వీధి మొగనే కాపలా కాశారు.

ఇంట్లోకి పోయేముందు, నిప్పు వెలిగించి, కాస్త

(39-వ పేజీ చూడండి)

# ఎర్ర బుఠ్ఠి

**శ్రీ రావి కొండలరావు**

ముందుగదిలో గోడ గడియారం పదిగంటలు కొట్టినా 'శంకు' ఇంకా నిద్ర పోలేదు. వంటింట్లో ఇల్లు కడగటానికి వాళ్లమ్మ నీళ్లు తెస్తే-అవన్నీ వొలకబోసి-ఆబిందెలో కాళ్లుపెట్టి ఆడుతున్నాడు.

"అబ్బబ్బ - ఏం అల్లర్రా? నువ్వూ నీ అల్లరీనూ. నిశి రాత్రయినా పడుకోకుండా కాల్చుకు తింటావు" అని విసుక్కున్నది వాళ్లమ్మ.

శంకుకి నాలుగేళ్లు! ఐనా ఇంకా చిన్నపిల్లలకు మల్లేనే మరీ పాపాయి చేష్టలు చేస్తాడు. వాడి పూర్తిపేరు రామశంకర్. ముద్దుగా 'శంకూ' అంటారు.

అమ్మ వంటయింట్లో పనంతా పూర్తిచేసి-శం చెయ్యిపట్టుకుని పడకగదిలోకి తీసుకుపోయింది. నాన్నగారు వాకిట్లో పడుక్కుని సిగరెట్టు కాలుస్తూ ఎవరితోనో మాట్లాడుతున్నారు.

"పడుకో మరి అల్లరి చెయ్యకా" అన్నది వాళ్లమ్మ శంకుని మంచంమీద పడుకోబెట్టి. శంకు కళ్లు మూసుకుని-మళ్ళీ తెరిచాడు!

"ఇదేంఖర్మరా! పడుకుంటావా. లేదా?" అని కేక వేసింది.

"నిద్ర రాదు" అన్నాడు నెమ్మదిగా.

"కళ్లు మూసుకుంటే అదే వొస్తుంది. పడుకో పొద్దున్నే లేవగానే - బిస్కత్తులూ, కాఫీ, అప్పచ్చులూ..."

"మరి పిప్పరెంటులో" అన్నాడు శంకు.

"ఫూ ... అవీనూ ముందు పడుక్కుంటేనే మరి"

శంకు వెంటనే కళ్లు మూసుకున్నాడు. క్షణంసేపు అమ్మ పక్కనే కూచుని - నిద్ర పోయాడని వెళ్లి మరేదో పని చూసుకుని వొచ్చింది. శంకు కళ్లు విప్పి చూస్తున్నాడు! వాళ్లమ్మ నిర్ఘాంతపోయి "ఏంరా! దెయ్యంపట్టినట్టు నిద్రపోక ఏం భాగోతంరా!- కొడతానుమరి-పడుకో" అని కేక వేసింది.

"వూఁ" అని మూలిగాడు శంకు.

"పోలీసువాళ్లకు వొప్పజెబుతాను-పడుక్కుంటావా? లేదా?"

"పోలీసంటే ఎవరే?" అన్నాడు.

"పోలీసా? అమ్మో - పెద్దంత మనిషి. ఎర్రటి టోపీ-కాకీబట్టలూ, మీసాలూ చేతిలో కర్రా-అమ్మయ్యో-ఎంత భయంకరంగా వుంటాడని" శంకుకి భయంవేసింది- "ఏం చేస్తాడే వాడు?" అన్నాడు.

"ఏం చేస్తాడూ? చీకటిగదిలో పడేసి-చీమలచేతా, తేళ్లచేతా కరిపించి-లాఠీ కర్రలతో కొడతాడు"

"ఎందుకూ?"

"పడుక్కోకపోతే-ఛూఁ-నిద్రపో మరి"

"పోలీసు చెడ్డవాడా అమ్మా?" అన్నాడు ఎటో ఆలోచిస్తూ.

"ఆఁ ఇంతా అంతా చెడ్డవాడా? అమ్మో - వొస్తాడు మరి పడుకో" అని కేకలు వేసింది. శంకుకి తలలో పెద్ద పోలీసువాడు కనుపించాడు. అంతంత మీసాలూ ఎర్రటిటోపీ-చేతిలో కర్రా-భయంకరంగా వున్నాడు.

"కళ్లు ముయ్యవేంరా?- రావయ్యా-పోలీసూ!" అని కేక వేసింది. శంకు ఛటాలున కళ్లు మూసుకున్నాడు. రెండు నిముషాలు చూసి అమ్మ శంకుపక్కనే పడుక్కుంది. ఐతే వాడికింకా నిద్ర రాలేదు. వాడి తలలో పోలీసువాడు ఇంకా కనుపిస్తూనే వున్నాడు!

ఒకనాడు ఆవూళ్లో పెద్ద యాత్ర జరిగింది. శంకూ వాళ్లమ్మా నాన్నగారూ అంతా వెళ్లారు. యాత్ర ఎంత గొప్పగా వుందని! బోలెడన్ని దుకాణాలూ, ఎంతో మంది మనుషులూ, రంగుల రాట్నాలూ - గారడీలూ అబ్బో-ఎన్నో వున్నాయ్. అవన్నీ సరదాగా చూశాడు శంకు. 'ఇహ ఇంటికి పోదాం' అని అనుకుంటూ వుంటే అక్కడ దుకాణాల్లోవున్న చిలకబొమ్మ కావాలని పోరుపెట్టాడు శంకు. "ఐతే కొంటా"నని వాణ్ని దింపి-బేరమాడి-చిలక కొని 'ఇంద' అని వెనక్కి చూసేసరికి అక్కడ శంకు లేడు! కొద్దిదూరంలో నాన్నగారు నించునున్నారు. ఆయన దగ్గిరికి వెళ్లిపోయాడేమో నని అమ్మ దగ్గిరకెళ్లి చూసి గతుక్కుమని "వాడేడీ?" అన్నది.

"ఎవరూ!" అన్నారాయన

(39-వ పేజీ చూడండి)

# పోలీసుల సో...

సోమవారంలో భీమేశ్వర రావు గారనే మేస్టారొక రుండే వారు. ఆయనకు లేకలేక కల్గిన కొడుకు విశ్వం. ఒక్కగాని కొడు కవటంచేత అల్లారు ముద్దుగా పెంచే వారు భీ మే శ్వ ర రా వు గారూ, ఆయన భార్య రుక్మిణమ్మానూ.

విశ్వానికి దాదాపు ఎనిమిదే ళ్లుంటాయ్. చిన్నవాడయినా అంత వయస్సులో సోపులెలా తయారు చేస్తారో, హేరాయిల్స్ ఎలా చేస్తారో, టార్చిలైట్ ఏవిధంగా పనిచేస్తుందో మొదలైన విషయా లన్నీ తెలుసుకునేందుకు ఎంతో వుబలాట పడేవాడు. అప్పు డప్పుడూ వాటినిగురించి తన తండ్రిని అడిగేవాడు. భీమేశ్వర రావుగారు తనకు తెలిసినంత మట్టుకు విశ్వంతో చెప్పి, వాడి సందేహాలను నివృత్తి చేసేవారు.

తన కొడుకు ఇంత చిన్న వయస్సులోనే ఇన్నిన్ని విషయాలు అడిగి తెలుసుకుంటున్నాడు కదా- పెద్దయితే ఎంతెంత ఘనకార్యాలు చేయబోతాడో అని ఇప్పట్నించే తెగ మురిసి పోయేవారు భీమేశ్వర రావుగారు.

అంతేకాదు, ప్రతిరోజూ రాత్రి పూట భోజనాలయ్యాక, భీమేశ్వర రావుగారు కొడుకును మంచం మీద కూర్చోబెట్టుకొని రైట్ సోదరులు విమానాన్ని ఎలా కని పెట్టిందీ, జేమ్సువాట్ చిన్న వయస్సులోనే ఆవిరివల్ల నడిచే ఇంజను యంత్రాన్ని ఏవిధంగా కనిపెట్టిందీ మొదలైన విషయా లంతా అమిత ఓపికతో చెప్పే వారు. విశ్వం చెవులప్పగించి అతి శ్రద్ధతో వినేవాడు. విని, తను కూడా చిన్నవయస్సులోనే ఏదో ఒకటి ఎందుకు కనిపెట్టకూడదూ- అని తరచూ అనుకునేవాడు విశ్వం.

**శ్రీ జి. వి. జి. కృష్ణ**

పైగా శెలవల్లో తీరిక వున్నప్పు డల్లా విశ్వాన్ని ఫ్యాక్టరీలకు పిలుచు కొని వెళ్లి, బంగారు మలామా, రాగిపూత ఎలా వేస్తారో; సోపుల నెలా తయారు చేస్తారో మొదలైన విషయాల్నంతా చూపించే వారు భీమేశ్వర రావుగారు.

ఒకరోజు వంటింట్లో విశ్వాన్ని వాళ్లమ్మ, చేతి దురద తీరేదాకా కొట్టూంటే, వాడు ఎలుగెత్తి ఏడుస్తూన్నాడు. పేపరు చదువు కుంటున్న భీమేశ్వర్రావు గారు, చివాలున లేచివెళ్లి "వసేయ్... ఆగవే- ఆగవే ... వాడినెందు కలా చంపేస్తూన్నావ్?" అని అడ్డు వచ్చారు.

"మీరూరుకోండి మీకు తెలియదు ... మీవల్లనే ఈకుంక ఇలా తయారౌతున్నాడూ" అని గర్జించింది విశ్వం అమ్మ.

"అసలింతకీ ఏం జరిగిందే?"

"ఏం జరగట మేమిటి వాడి చేతిలోని డబ్బాలో చూడండి. సీసాడు కొబ్బరిచమురూ దానిలో కుమ్మరించుకున్నాడు."

"అందుకా? - ఒరేయ్ విశ్వం నువ్వు హాలులోకి వెళ్లు" అని వాడ్ని పంపించేసి, భార్యతో "చూడవే మనవాడు సామాన్యుడు కాడు-బలే అసాధ్యుడు. ఇంత వయసులోనే వాడి బుల్లిబుర్రలో ఎంతేసి ఆలోచనలుంటాయో నీకు తెలుసు కదా! నేను క్లాసులో ఎంతగా గొంతు చించి మొత్తు కున్నా, చెప్పినదాన్ని విని అర్థం చేసుకునే వెధవాయి ఒక్కడూ లేడు. అలాంటిది - మన వాడ్ని చూస్తున్నావుగా, నన్నడిగి ఎన్ని విషయాలు తెలుసుకొని, నేను చెప్పిన వాటినంతా ఎంచక్కా అర్థం చేసుకొంటున్నాడో. చిన్న ప్పుడు ఇలా వున్నవాళ్లే, పెద్ద అయ్యాక గొప్ప గొప్ప ఘన కార్యాలు చేస్తూంటారు. కనుక వాడేదైనా పరిశోధనలు చేయ టానికి పూనుకుంటే, నువ్వు వాడి ప్రయోగాలకు అడ్డురాకు. వాడిష్టం వచ్చినట్లు వాడ్ని వది లేయ్. ఈవిషయమై మనకెంత ఖర్చయినా అదోనష్టం కాదు. ఏం- తెలిసిందా?" అన్నారు భీమే

శ్వర్రావుగారు. అందుకు ఆమె కిక్కు-రు మనలేదు.

ఆనాటినించీ భీమేశ్వరరావు గారు, కంటికి కనిపించిన ప్రతి పెద్ద మనిషితో, తన కొడుకును గురించి నోరు నొప్పెత్తేలా తెగ పొగడ నారంభించాడు.

ఆవేళ ఆదివారం. భీమేశ్వరావు గారు సాయంత్రం పెందల కడనే, కడుపునిండా సుష్టుగా భోంచేసి, హాలులో వాలు కుర్చీమీద కూర్చొని భుక్తాయాసం తీర్చుకుంటున్నారు. ఉన్నట్లుండి, వీధి తలుపు దభదభా తట్టిన చప్పుడైంది. భీమేశ్వర్రావు గారు ఆయాసంతో లేచి, ప్రయాసతో కాళ్లీడ్చుకుంటూ వెళ్లి తలుపు తీశారు. అంతే తనకళ్లను తానే నమ్మలేక పోయారు. ఎదురుగా ముగ్గురు పోలీసులతో సాక్షాత్కరించిన సబ్ ఇనస్పెక్టర్ "భీమేశ్వరావ్ గారిల్లిదేనా?" అని గంభీర స్వరంతో ప్రశ్నించాడు.

"ఔను...ఎందుకండీ"అని తెల్లబోతూ అడిగాడు భీమేశ్వర్రావు గారు.

"మీ ఇంటిని సోదా చేయటానికి వచ్చాం మేము"

భీమేశ్వర్రావుగారి గుండె దాదాపు ఆగినంత పనయింది. "మాఇంటినా?...ఎందుకండీ?"

"ఎందుకంటే - చూడండి ఈ రిపోర్టు. మీ ఇంటినించి శవము మురిగిన వాసన వస్తూందని అనుమానపడి మీఇంటికి చుట్టుప్రక్కల వున్న వాళ్లలో ఒకరు, మాకు కంప్లయింట్ చేశారు." అని హుందాతో అన్నాడా సబ్ ఇనస్పెక్టరు.

"అబ్బే...మాఇంట్లో అలాటిది ఎందుకు వుంటుందండీ ... మీరు పొరబడి వుండొచ్చు" అని తడబడే గొంతుకతో అన్నారు భీమేశ్వర్రావుగారు.

"మేమేం పొరబడలేదు. మీ ఇంట్లోవుండే వారందరూ ఒకచోట వచ్చి నిలుచొని వుండాలి. మేము మాపని ముగించుకొని పోతాం. ఊఁ...త్రీనాట్ ఫోర్ - నువ్వు ఈ వైపున వెళ్లు. ఏయ్ వన్‌ఫార్టీ ఫోర్ నువ్వు వీళ్లదగ్గర వుండు. ఫోర్ నాట్ సిక్స్ - నువ్వు నాతో కూడా రా" అని అందర్నీ ఆజ్ఞాపించి, లాఠీని గాలిలో గిరగిరా తిప్పుతూ, ఓగదిలోకి దూరాడు సబ్ ఇన్‌స్పెక్టర్.

అర్ధగంటయింది. ఒక్క-గంట యింది. ఎవ్వరికీ ఏమీ అంతు దొరకలేదు. భీమేశ్వర్రావు గారూ, ఆయనభార్యా, విశ్వం ఒకచోట నిలుచొని కంటిమీద రెప్పవాల్చకుండా పోలీసులు సోదా చేయటాన్ని చూస్తున్నారు.

కొంతసేపటికి "ఈ గదినించి వస్తోంది సార్!!" అని ఎలుగెత్తి అరిచాడు. నెం. 304 పోలీసు. సబ్ ఇన్‌స్పెక్టర్ ఒక్క గెంతున ఆగదిలో జొరబడిఆత్యాశ్చర్యంతో "ఎక్కడా?" అన్నారు. "ఈ అలమారు నించి వస్తూన్నట్లుందండీ" అన్నాడు ఆపోలీసు.

సబ్ యిన్‌స్పెక్టరు భీమేశ్వర్రావు గార్ని పిలిచి "ఈ బీరువా తాళం తియ్యండి ... ఇందులో ఏముంది?" అని ప్రశ్నించాడు.

"ఇందులో మా అబ్బాయి ఆడుకొనే సామాను లుంటాయండీ- అంతే, ఇహనేమీ వుండవు" అని ఊరుకున్నాడు భీమేశ్వర్రావ్.

"ఏదీ తాళం తియ్యండి" విసుక్కు-న్నాడు సబ్ యినస్పెక్టర్. భీమేశ్వర్రావు తాళం తీసి తలుపు తెరిచాడు. వెంటనే సబ్ యినస్పెక్టర్. ముక్కు-కు గప్పున ఏదో ఛండాలమైన కంపు కొట్టింది. ముక్కు-కు అడ్డంగా జేబురుమాలుంచుకుని ఆ అలమారంతా చూశాడు సబ్ ఇన్‌స్పెక్టరు.

అందులో కొన్ని ఆటవస్తువులూ, రెండు తుప్పుపట్టి నొక్కు-పోయిన పాత డబ్బాలూ తప్ప ఇహనేమీ లేవు. సబ్ ఇన్‌స్పెక్టరు ఒకడబ్బాను చేతికెత్తుకొని మూత తీశాడు. కొన్ని చెడిపోయిన టార్చిలైట్ బల్బులూ రాగి తీగలూ అందులోవున్నాయి.





# ★ పోలీసుల సోదా ★

అందులో దాన్నిమూత మూసి యథాస్థానంలో వుంచి, ఇంకో డబ్బాను అందుకొని మూత అలా తెరిచాడో లేదో సబ్ ఇన్స్పెక్టర్ ఉక్కిరి బిక్కిరై పోయాడు. ఏదో పాడు వాసన క్షణంలో ఆగది అంతా వ్యాపించి పోయింది. అందరి ముక్కులూ బ్రద్దలైపోతూన్నాయ్ ఆ వాసనకు. సబ్ ఇన్స్పెక్టర్ 406వ నెంబర్ పోలీసును టార్చ్ లైట్ వేయమని, ఆ డబ్బాలోకి పరీక్షగా చూసీ "ఇది ఏమిటీ... ఇందులో ఏముందండీ" అని భీమేశ్వర్రావు గార్ని పిలిచి అడిగాడు. ఆయన ఆడబ్బాను ఆడించి చూసి, అర్థంగాక తికమకలు పడుతూ "ఏమిటో నాకు తెలియకుండా వుందండీ. మావాడ్ని పిలుస్తా- వాడికేమైనా తెలిసుంటుందేమో" అని విశ్వాన్ని పిలిచి "ఇందులో ఏముందిరా?" అని కనుబొమలు చిట్లించుకొని ప్రశ్నించాడు.

"వాసన చమురు" అన్నాడు విశ్వం.

"వాసన చమురేమిట్రా నీ మొహం. నీకెక్కడ దొరికిందిరా ఇది- వెధవాయ్"

"నేనే తయారు చేశా నాన్నా. సబ్బు తునకలూ, మన ఇంటి ఎదురుగా వుండే చెట్టు ఆకులూ అరటి తొక్కలూ ఇంకా ఏమేమో వేసి"

భీమేశ్వర్రావు గారికి ఆక్షణాన ఏడవ్వాలో నవ్వాలో తెలియక పోయింది "ఓరి కుంకా..,నీ ప్రయోగాలూ పరిశోధనలూ పాడుగానూ...ఎంత ప్రాణం తీశావురా. ఇదేమి హేరాయిల్రా బడుద్ధాయ్- ఎంత ప్రాణం తీశావురా" అని ఒక్కొక్క మాటంటూ విశ్వానికి ఈలెంపా ఆలెంపా వాయించ మొదలెట్టాడు.

అంతవరకూ అక్కడ నిశ్చేష్టుడై నిలుచునున్న సబ్ ఇన్స్పెక్టరు విశ్వానికి అడ్డువచ్చి "ఆఁ...కొట్టకండీ - కొట్టకండీ" అని తర్వాత "ఏమిటండీ-నాకేమీ అర్థంకాలేదు మీ అబ్బాయి చెప్పింది" అన్నాడు. భీమేశ్వర్రావు అంతా పూసగుచ్చినట్లు చెప్పేశాడు సబ్ ఇన్స్పెక్టరు పొట్ట చెక్కలయ్యేలా నవ్వుతూ, అక్కడొక కుర్చీ వుంటే దానిమీద ఉస్సూరు మంటూ కూలబడి "బలే కుర్రాడండీ మా కందరికీ బలేపని కల్పించాడు...ఇలారా నాయనా" అని విశ్వాన్ని దగ్గరికి పిలిచి ముద్దెట్టుకున్నాడు. సబ్ ఇన్స్పెక్టరు కోరమీసాలు విశ్వం నూనూగు బుగ్గలకు గుచ్చుకొని గిలిగింతలు పెట్టాయో ఏమో విశ్వం వొళ్లు పులకరించింది. అంతేకాదు ఏమో మహా ఘనకార్యంచేసిన వాడిమల్లే పోజుపెట్టేసి నిలుచున్నాడు విశ్వం—

సబ్ ఇన్స్పెక్టరు నవ్వాపుకోలేక "అది కాదండీ. ఇంత ఘాటు వాసన మీ ముక్కులకు ఎప్పుడూ కొట్టలేదూ" అని ప్రశ్నించాడు.

"కొట్టకేమండీ...కొట్టింది. నేను మా ఇంటి ప్రక్కన పెంటకుప్పల్లో ఏ పందికొక్కో చచ్చిపడి వుంటుందని నిర్లక్ష్యంతో వూరుకున్నా" అన్నాడు భీమేశ్వర్రావ్.

తర్వాత సబ్ ఇన్స్పెక్టరు లేచి నిలుచొని, ఆవలింతలలో వొళ్లు విరుచుకుంటూ "క్షమించాలి. ఉద్యోగరీత్యా నేనిలా చేయాలొచ్చింది. ఈ విషయమై మీకే మాత్రం తొందర కల్గినా క్షంతవ్యులం" అన్నాడు.

"ఆఁ ... దానిదేముంది లెండి మీ ఉద్యోగ ధర్మం మీరు నెరవేర్చారు"

"వస్తానండీ శెలవు ... వస్తానా అబ్బాయి. ఒరేయ్ వన్ ఫార్టీఫోర్... ఆడబ్బాను పట్టుకరా...ఏమండోయ్ ఈడబ్బాను నేను తీసుక వెళ్తున్నా" అన్నాడు సబ్ ఇన్స్పెక్టరు.

"మా కుంకను కూడా మీతో తీసుకు వెళ్లి జైల్లో వేయించండి. అప్పటికి కానీ వాడి పొగరణగదు. ఇంట్లో చెప్పినమాట ఒక్కటీ వినడు. వెధవాయి వేలెడంత లేడు— ఈవేళ మా వంశ మర్యాదలంతా మంట కలిపాడు" అని గది అవతల నించే విశ్వం అమ్మ బావురుమంది.

సబ్ ఇన్స్పెక్టరు నవ్వుతూ పోలీసులతో వెళ్లి పోయాడు.

తలుపు చాటున నిలుచొని క్రీగంటితో ఓరచూపులు చూస్తూ "అమ్మ బలే చెడ్డది కదు నాన్నా" అని తండ్రిని మంచి చేసుకోబోయాడు విశ్వం.

"నోర్మూసుకోరా వెధవాయ్, నోరెత్తితే పీకనులిపి గోడవతల విసిరేస్తా" అని గాండ్రించాడు భీమేశ్వర్రావు.

ఏడుపు మొహంతో బిక్కుబిక్కు మంటూ పడకమీద చేరి, ముసుగు బిగదన్ని క్షణంలో ప్రశాంతంగా నిద్రపోయాడు విశ్వం. ★

# ముచ్చటగా ముగ్గురు

(34-వ పేజీ తరువాయి)

కాఫీకానీ ఏదైనా కాచుకొందామనుకొన్న జడ్జి, తీరా యింట్లోకి వెళ్లాక బేజారైపోయిన గుండెలతో వణికిపోతున్న చేతులతో తాను ఆపనికి పూనుకొంటే ఏడబ్బాలో కింద జారవిడిచేస్తానని భయపడి వూరుకొన్నాడు. తానా సమయంలో అటువంటి చప్పుడు ఏకాస్త చేసినా వాళ్ల యింటి యజమానురాలు ఎవడో దొంగ తనయింట్లో దూరి దోచేస్తున్నాడని కంగారుపడి, పోలీసులకోసం కేకలు వేసితీరుతుందని వీడికి బాగా భయంవేసింది.

అప్పుడు వాడు వున్న పరిస్థితిలో నిజంగా అదంతా జరిగినట్లూ, తనని ఆ సి. ఐ. డి. వెధవలు పట్టుకొని వెళ్లినట్లూ, కోర్టులో తనని నిలబెట్టి విచారణ చేస్తున్నట్లూ, తాను నిర్దోషిననీ కేవలమూ కాలక్షేపంకోసమే వీధుల్లో తిరుగుతున్నానని జ్యూరీ పెద్దలకి తాను నచ్చచెప్పబోయి విఫలుడైనట్లూ, కోర్టువారు తనకు ఇరవైఏళ్ల కఠిన శిక్ష విధించినట్లు, ఆవార్త వినగానే తనతల్లి గుండె పేలిపోయి చచ్చినట్లు వూహించుకొని మనిషి వజవజ వణికిపోయాడు. తెల్లవారి ఏడుగంటలకి యింటి యజమానురాలు నిద్దర లేచి కాఫీకాచి పట్టుకొచ్చేదాకా కోటు కప్పుకొని కుర్చీలో అల్లా కొయ్యబొమ్మలా కూర్చుండిపోయాడు.

ఆరోజు మొదలుకొని తాను ఎన్నడూ పెందలకడే నిద్రలేవలేదని జడ్జి అన్నాడు. [ఇంకా వుంది]

# ఎర్ర బుట్ట

(35-వ పేజీ తరువాయి)

ఆశ్చర్యంగా.

"శంకు"

"శంకు' - శంకు" అని యాత్ర అంతా పిలిచి వెతికి చూశారు. ఎక్కడా కనపడలేదు! వాళ్లమ్మ భోరుమని ఏడుపు ప్రారంభించింది.

చిలక కొంటున్నసమయంలో పక్కన జరుగుతున్న గారడీ చూట్టానికి వెళ్ళి - శంకు - అక్కణ్ణుంచి అమ్మను కలుసుకుందామని ఇటు రాబోయి అటు పోయాడు! ఆ పోవటం అల్లా 'అమ్మా' అంటూ ఏడుస్తూ పోతున్నాడు. ఇంతలో వొకాయన తీసి "ఎవరు నాయనా మీ అమ్మ?" అని అడిగాడు. శంకు ఏడుపు తప్ప జవాబులేదు. చేతిలో తల కొరికేసిన పంచదార చిలక, కన్నీళ్ళను నానిపోయి వొంటినిండా రాసుకుంది! "పోలీసు స్టేషనుకు తీసుకుపోయి - యిచ్చి రండి" అన్నాడు వొకాయన. ఇంకొకాయన శంకుని ఎత్తుకుని - మాటలు చెబుతూ పోలీసుస్టేషనుకు తీసుకోపోయాడు! ఆయన మాటలు వింటూ అమ్మ సంగతి మరిచిపోయి, ఏడుపు మానేసిన శంకుకి ఎదురుగా 'పోలీసు' కనిపించాడు. పెద్ద మీసాలూ, భయంకరమయిన మనిషీ, ఎర్రటిటోపీ - చేతిలో కర్రా చూసి శంకు వొకసారి 'అమ్మా' అని అరిచాడు!

"ఫరవాలేదమ్మా - రా ఇక్కడ కూచుందాం" అని ఆయన స్టేషన్లోకి తీసుకెళ్ళి రిపోర్టు ఇచ్చి - శంకుని వొదిలిపెట్టి వెళ్ళిపోయాడు. ఇప్పుడు శంకు గుండెల్లో హోరు ప్రారంభమయింది. వొళ్లంతా వేడెక్కిపోయింది. ఎటుచూసినా పోలీసులే! శంకుకి అమ్మ చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి. "చీకటి కొట్లో పడేసి, చీమలచేతా తేళ్ళచేతా కరిపించి - లాఠీలతో కొడతాడు" అని. వొఖసారి 'కొయ్య'లాగా ఐపోయాడు శంకు.

"నీపేరు ఏమిటి అబ్బాయ్? అమ్మ వొస్తుంది పోదాం. ఇంద... చాక్లెట్లు తింటావా?" అని అడుగుతూ పెద్దమీసాల పోలీసు శంకుమీదికొస్తుంటే- వాడికి చెప్పరాని భయంవేసి 'అమ్మో' అని కేకపెట్టి స్పృహతప్పి పడిపోయాడు. ఎక్కడా శంకు దొరక్కపోగా వాళ్ళ నాన్నగారూ, అమ్మా పోలీస్ స్టేషన్లో రిపోర్టు చెయ్యటానికి వొచ్చారు. రాగానే బెంచీమీద పడివున్న 'శంకు'నూ, ప్రక్కనే నీళ్లు మొహంమీద జల్లుతున్న పోలీసునూ చూశారు. అమ్మ 'శంకూ' అని కేకపెట్టి పరుగెత్తి వొచ్చింది. తమ పిల్లాడని చెప్పి నాన్నగారు శంకుని తీసుకొన్నారు.

"నన్ను చూడగానే నండీ ఇట్లా మూర్ఛ వొచ్చింది!" అన్నాడు పోలీసు.

నాన్నగారు అమ్మవేపు కోపంగా చూసి "చూశావా! నీమూలానే ఇదంతా. 'పోలీసు' 'పోలీసు' అని జడిపించావ్...ఇప్పుడు చూడు ఏం జరిగిందో" అన్నారు.

అమ్మ ఏడుస్తూ "అవును- నాదే తప్పు. సరే ముందు డాక్టరుదగ్గిరికి పదండి" అన్నది! ★



# దీర్ఘాయువు

(బౌద్ధగాథ)

శ్రీ గోవిందులూరి సాంబశివరావు

(గత సంచిక తరువాయి)

## 7

బ్రహ్మదత్తుని కొలువులో కుమార దీర్ఘాయువు అప్రమత్తుడై సేవాధర్మాన్ని పాలించాడు. రోజూ రాజుగారికన్న ముందుగా లేచేవాడు. రోజూ రాజుగారి మేడల్లో అంతా పడుకొని సద్దుమణిగిన తర్వాత తాను నిద్రకు పోయేవాడు. "ఏమిపని వుంది; ప్రభూ! ఏమి ఆజ్ఞాపిస్తారు! రాజా!" అంటూ వెంట వెంటపడి తిరిగేవాడు ప్రియచారి, ప్రియవాది అయిన దీర్ఘాయువుపట్ల రాజుకు ఎక్కడలేని విశ్వాసం అనతికాలంలోనే కుదిరింది. "అబ్బాయి! నువ్వు ఎవ్వరు! నీపేరేమిటి? నీ తల్లి దండ్రులు ఎవ్వరు!" అని ఒక్కరోజున కూడా రాజు అతణ్ణి అడగలేదు. దీర్ఘాయువు తన సంగీతంతో రాజును మైమరపు కలిగిస్తూ అట్టి ప్రశ్నలు అడగనీయలేదు.

ఒకరోజున కాశీరాజు బ్రహ్మదత్తుడు కుమారదీర్ఘాయువును చూచి ఈలా అన్నాడు.

"అరే! కుఱ్ఱవాడా! రథంమీద వేటకు పోదాం వస్తావుటరా!"

"చిత్తం మహారాజా"

"అయితే రథాన్ని సిద్ధం చేసుకురా"

"చిత్తం! మహారాజా"

దీర్ఘాయువు రథాన్ని ముందుకు వచ్చాడు. "మహారాజా! రథం సిద్ధంగావుంది; ఏమి సెలవు" అని బ్రహ్మదత్తుణ్ణి అడిగాడు. రాజు రథం ఎక్కాడు. కూర్చున్నాడు. "అరే! అబ్బాయి! రథం నువ్వు తోలరా!" అన్నాడు. దీర్ఘాయువు మొగల్లో, రాజు రథంలో. రథం బయలుదేరింది. దీర్ఘాయువు చేతుల్లో గుఱ్ఱాలు విచిత్రవిన్యాసాలు చేశాయి. రథం భూమిని అంటీ అంటకుండా నడిచింది. సైన్యం వెనకబడి పోయింది. వారు రథం వెంట పడుగులు పెట్టలేకపోయారు. వారి గుఱ్ఱాలు అలిసిపోయినాయి. దీర్ఘాయువు రథవేగాన్ని తగ్గించలేదు. రాజు తగ్గించమనలేదు. సైన్యం దారి సైన్యానిదైపోయింది. రథం దారి రథానిదైపోయింది. రథం చాలాదూరం గడిచింది. "అరే! అబ్బాయి! ఇక రథం ఆపు! ఇక్కడ విడుదాం" అని రాజు అన్నాడు. దీర్ఘాయువు రథం ఆపాడు. మొగల్లోంచి మొగ్గవేసి క్రిందకు దూకి, కూర్చున్నాడు. బ్రహ్మదత్తుడు కూడా క్రిందకు దిగివచ్చి, దీర్ఘాయువు తొడలమీద తలపెట్టుకొని, కొంచెం సడుం వాల్చాడు.

రథం ఎక్కువగా నడపడంవల్ల బ్రహ్మదత్తుడి శరీరం హూనం హూనమయిపోయింది. ఆశ్రమచేత అలసిన అతనికి వెంటనే నిద్రపట్టింది. అప్పుడు దీర్ఘాయువుకు మనస్సులో ఇట్లా అనిపించింది "కాశీ రాజయిన ఈ బ్రహ్మదత్తుడు మాకు చేయరాని

అనర్థాలు చేశాడు. మా సేనను వశం చేసుకున్నాడు వాహనాలు తోలుకున్నాడు. కోశం కాజేశాడు. కోష్ఠాగారం నాశనం చేశాడు. ఈ కాశీరాజు నాతల్లిని తండ్రిని హత్య చేయించాడు. ఆవైరాన్నంతా తీర్చుకోడానికి ఇంతకన్న మంచి సమయం ఇంకో అప్పుడు దొరుకుతుందా?" అని ఈవిధంగా ఆలోచించి ఒరలోంచి కత్తిని తీసి, రాజును చంపడానికి దీర్ఘాయువు ఉద్యుక్తుడైనాడు. అప్పుడు తండ్రి వారణాసిలో తన్ను ఉద్దేశించి అన్న మాటలు జ్ఞాపకానికి వచ్చాయి. చచ్చిపోతూ చచ్చిపోతూ తండ్రి దిఘితి ఇచ్చిన సందేశం అతని చెవుల్లో గింగురులు మ్రోగింది. "తాత! దీర్ఘాయువా! చిన్నపనిని పెద్దపని చెయ్యబోకు. వైరంచేత వైరం ఎన్నడూ అంతం కాదు. అవైరం చేతనే, తాత! దీర్ఘాయువు! వైరంఅంతం అవుతుంది." అని తండ్రి అన్న ఈమాటలు ఆకారాలు దాల్చినట్లు అతని మనస్సు ముందు సాక్షాత్కరించాయి. "ఈపని చేయడం నాకు ఉచితం కాదు. తండ్రి మాటను అన్యథాకరించడం గూడ ధర్మపథం కాదు." అని దీర్ఘాయువుకు అనిపించింది. అప్పుడు దీర్ఘాయువు కత్తిని ఒరలో పెట్టివేశాడు.

మళ్ళీ మనస్సు పరిపరివిధాల పోయింది. ఇంత చక్కాని శత్రువు ఎప్పుడన్నా చేతిలో చిక్కుతాడా? సమయం అందివచ్చినప్పుడు జారవిడుచుకోవడం క్షేమం అవుతుందా? మళ్లీ కత్తిని ఒరలోంచి బయటికి తీశాడు. మళ్లా తండ్రి మాటలు జ్ఞాపకానికి వచ్చి చెవులలో గింగురుమని మ్రోగాయి. అవి ఆకారాలు దాల్చి మనస్సుముందు సాక్షాత్కరించాయి. ఒకసారి, రెండుసార్లు, మూడుసార్లు దీర్ఘాయువు ఇట్లా వితర్కించాడు. మూడుసార్లూ ఇది ఉచితం కాదనుకున్నాడు; ఇది ధర్మంకాదనుకున్నాడు. ఇంతలో కాశీరాజు నిద్రనుంచి భయంతో వణికిపోతూ లేచాడు. ఉద్విగ్నుడై లేచాడు. శంకాసంకులమైన మనస్సుతో లేచాడు. దీర్ఘాయువుకు ఆశ్చర్యంవేసి, ఇట్లా అన్నాడు.

"మహారాజా! ఏమిటి అట్లా భయపడుతూ లేచారు. అట్లా వణికిపోతున్నారేమిటి?"

"అరే! కుఱ్ఱవాడా! ఏమి పాడు కల వచ్చిందిరా. తలచుకుంటే ఇప్పుడు గూడా భయం వేస్తున్నది."

"అంత భయంకరమైన కల ఏమి వచ్చింది! మహారాజా!"

"అవునురా! అబ్బాయి! కోసల రాజు కొడుకు దీర్ఘాయువు ఒకత్తి, పుచ్చుకు నన్ను నరకడానికివచ్చినట్లు కలవచ్చింది. కలలో నిజంగా ఆదీర్ఘాయువును నరికేద్దామనుకున్నాను గాని, అతడే నామీదికి వచ్చాడు. తర్వాత భయంవేసింది. భయంలో నిద్రమెలుకువ వచ్చింది."

"దీర్ఘాయువును ఎప్పుడన్నా చూచారా మహారాజా!"

"లేదురా! అబ్బాయి! చూస్తే చంపివుండేవాణ్ణేగా"

దీర్ఘాయువుకు ముఖం జేవురించింది. కళ్లు ఎఱ్ఱబడినాయి. "అరే! ఈరాజు ఎంతటి దీర్ఘక్రోధి. మా రాజ్యాన్ని సర్వమున్నూ హరించాడు. గూఢచారులను పెట్టి వెతికించి, వెతికించి, నాతల్లిదండ్రులను చంపివేశాడు: అయినా అతనికి క్రోధం తీరలేదు. రాజ్యదాహం ఆరలేదు. దీర్ఘాయువు ఎవరో తెలియదు. తెలిస్తే నన్ను గూడా చంపివేసేవాడేగదా! వాస్తవ ప్రపంచంలో తీరని ఈకోర్కె నిత్యం మనస్సుచేత మననాన్ని పొంది నిద్రలో గూడా ఇతణ్ణి వదలకుండా వుంది. ఇట్టివాణ్ణి వదిలిపెట్టడం అయోగ్యం" అని ఆలోచించి కాశీరాజు శిరాన్ని ఎడమచేత్తో పట్టుకొని, కుడిచేత్తో కత్తిని ఒరనుంచి లాగి, "అరే! బ్రహ్మదత్తా! నేనే కోసలరాజు కుమారుణ్ణి దీర్ఘాయువును. నీవల్ల మాకు అనేక అనర్థాలు కల్గాయి. నువ్వు మమ్మల్ని అనేక అనర్థాలపాలు చేశావు. మా సేన వశంచేసుకున్నావు. వాహనాలను తోలుకున్నావు. కోశాన్ని హరించావు. కోష్ఠాగారాన్ని దోచుకున్నావు. మా రాజ్యాన్ని హరించావు. అంతటితో ఆగావా! నా తల్లిని, నా తండ్రిని చంపావు. వారి పేరు మీదుగా ఎవరో ఒక కొడుకు దీర్ఘాయువు వుంటే వాణ్ణికూడా చంపితేనేగాని తీరనంతటి వైరాన్ని నీలో ఇంకా నిల్పుకొని వున్నావు. నిన్ను నేను ఎందుకు బ్రతకనివ్వాలి. నేను వైరమార్గాన్నే అనుసరించి నీఅంతాన్ని కళ్లజూస్తా" అంటూ ఖడ్గాన్ని ఝళిపించాడు.

కాశీరాజు బ్రహ్మదత్తుడికి ఎక్కడలేని భయమూ పుట్టుకువచ్చింది. ఈ దీర్ఘాయువు ఇతడా! ఇప్పుడు నన్ను

# ★ దీర్ఘాయువు ★

చంపివేస్తే! అహో! కష్టం! అయినా ఇట్లా అని చూద్దాం. 'తాతా! దీర్ఘాయువు! నాకు జీవనదానం చెయ్యి. నా ప్రాణాన్ని రక్షించు' దీర్ఘాయువుకు తండ్రి మాటలు మళ్ళీ జ్ఞప్తికి వచ్చాయి. పుత్రా! దీర్ఘాయువు వైరంచేత వైరం అంతం కాదు. అవైరంచేతనే అంతం అవుతుంది. ఈ తండ్రి మాటలోవున్న అర్థం దీర్ఘాయువుకు అప్పుడు అర్థం అయింది. ఈ బ్రహ్మదత్తుణ్ణి చంపుతాను బ్రహ్మదత్తుడు చస్తాడు. అయితే ఏమవుతున్నది? బ్రహ్మదత్తుడు అంతం అవుతున్నాడు. వైరం అంతం కావడంలేదు. అది అట్లాగే నిలుస్తున్నది. ఇదా! సత్యము! ఇదా ధర్మము! దీర్ఘాయువు ముఖం ప్రసన్నతను పొందింది. కళ్లు మందహాసం చేశాయి. "కాశీరాజా! బ్రహ్మదత్తా! నీకు నేను ప్రాణదానం చేస్తాను. నాకు నువ్వు ప్రాణదానం చేస్తావా?"

"తాత! దీర్ఘాయు! నువ్వు నాకు ప్రాణదానం చేయి. నేను నీకు ప్రాణదానం చేస్తాను."

దీర్ఘాయువు బ్రహ్మదత్తుణ్ణి వదిలిపెట్టాడు. కత్తిని ఒరలో పెట్టివేశాడు. బ్రహ్మదత్తుడికి ఆశ్చర్యం వేసింది. చేతిలో చిక్కిన శత్రువునే వదిలిపెట్టివేశాడే! ఏమిరా! ఈ ఔదార్యం. ఏమిరా! ఈ సత్యవాక్యత! బ్రహ్మదత్తుని మనస్సు ఈ మహౌదార్యం ముందు సిగ్గుపడిపోయింది. హృదయంలో ఒక సంతోషం విరిసింది. అతడు దీర్ఘాయువును కౌగలించుకున్నాడు. దీర్ఘాయువును ముద్దుపెట్టుకున్నాడు. మనస్సులో బ్రహ్మదత్తుడు అనుకున్నాడు; "ఇతనికి ద్రోహం చేయనని మాట ఇచ్చాను. నిలుపుకుంటాను" అని. పైకి అన్నాడు: "తాత! దీర్ఘాయు! రథాన్ని పూన్చు; వెళ్లిపోదాం" అని.

"చిత్తం! మహారాజా" దీర్ఘాయువు రథం పూన్చుకువచ్చాడు. రాజు రథంయెక్కాడు. దీర్ఘాయువు మొగల్లో కూర్చున్నాడు. రథం కదిలింది. గుఱ్ఱాలు దీర్ఘాయువు చేతుల్లో విచిత్రవల్గనాలు నడిచాయి.

## 8

రథం వారణాసిలో ప్రవేశించింది. రాజనగరులో ప్రవేశించింది. రాజ మహాలుముందు దీర్ఘాయువు రథాన్ని ఆపాడు. బ్రహ్మదత్తుడు రథం దిగి; మనుష్యులను పిలిచి "ఒరే! మీరుపోయి తక్షణం అమాత్యులను పిలుచుకురండి. పరిషత్తును పిలవండి" అని ఆజ్ఞ ఇచ్చాడు.

మంత్రులు వచ్చారు పరిషత్తు అంతా వచ్చింది. రాజు సింహాసనం మీద కూర్చున్నాడు. మంత్రులతో పరిషత్తుతో ఇట్లా అన్నాడు. "మంత్రులారా! పారిషదులారా! ఈకుఱ్ఱవాణ్ణి చూచారా! ఇతను ఎవరో తెలుసా! కోసలరాజు దిఘితి పుత్రుడు. దీర్ఘాయువు అన్న పేరుగలవాడు" వెంటనే సభలో కలకలం బయలుదేరింది. ఒకరితరువాత ఒకరు మాట్లాడవచ్చునని ఎవరికి వారు అనుకున్నారు. కాని అంతా ఒక్కసారే మాట్లాడారు. కొన్ని మాటలు ఇట్లా వినిపించాయి. "ప్రభూ! వీడిచేతులు నరుకుతాం" "మహారాజా! వీడి కాళ్లు నరికేద్దాం" "రాజా! వీడికాళ్లూ, చేతులూ రెండూ నరికేద్దాం" "ప్రభూ! వీడి కళ్లు పీకేద్దాం." "మహారాజా! వీడినాలుక కోద్దాం" "రాజా! వీడికళ్లు, వీడినాలుక రెండూ తీసేద్దాం కోసేద్దాం" "ప్రభూ! వీడి చెవులు కోద్దాం" "మహారాజా! వీడిముక్కు కోద్దాం" "రాజా! వీడి చెవులూ, ముక్కూ రెండూకోద్దాం"

రాజు చేయియెత్తాడు. సభ సావధానం అయింది. రాజు మళ్లీ ఈలా అన్నాడు: "మంత్రులారా! పారిషదులారా! మీరు ఇన్నివిధాలుగా బాధపెడదామనుకుంటున్న కోసల రాజు దిఘితి పుత్రుడు ఏమిచేశాడో తెలుసా! నేను ఒంటరిగా చిక్కితే, నన్ను చంపకుండా వదిలిపెట్టాడు. నాకు ప్రాణదానం చెయ్యమన్నాను. చేశాడు. నన్ను ప్రాణదానం చెయ్యమన్నాడు. చేశాను. అందువల్ల మీరు అన్నపనులేమీ జరిగేందుకు వీలులేదు. అదీ కాక ఇంకొసంగతివి మీరు గుర్తించడం లేదు కోసలరాజు దిఘితి రాజ్యాన్ని హరించాను కోశాన్ని హరించాను. సేనను వశం చేసుకున్నాను. అన్నీ చేశానుకాని దిఘితిమీద వైరాన్ని చంపుకోలేకపోయాను. దిఘితిని దిఘితిభార్యను పట్టించాను. ఇద్దరిని అవమానంచేసి మరీ చంపించాను. మీరంతా సంతోషించారు. కాని దిఘితి ఎప్పుడన్నా మనమీద

కతుకట్టాడా? మనమీద వైరం నెరపాడా? ఈసంగతులు మీరు ఆలోచించలేదు. నన్ను ఆలోచించనీయలేదు. అతణ్ణి చంపుతానంటే చంపమన్నారు. చంపాను. మీ వైరం తీరిందా? నావైరం తీరిందా? లేదు. దీర్ఘాయువు ఇతడేనని మొదటలోనే తెలిస్తే చంపివుండేవాణ్ణే. మీరు ఇప్పుడు ఎట్లాగూ చంపమంటూ నేవున్నారు. మీ ప్రాణంతీపి మీకు తెలుసునేమో గాని; ఇంకో ప్రాణం తీపి తెలియదు. నాకుగూడా ఇవ్వాళ్లటిదాకా తెలియలేదు. దీర్ఘాయువు నాకళ్లను తెరిచేదాకా తెలియలేదు. అతడు చేతిలో చిక్కిన శత్రువుకు గూడా ప్రాణదానం చేశాడు. నేను గూడా అట్లాగే చేస్తానని మాట ఇచ్చాను. నిలుపుకుంటాను" అన్నాడు. సభలో అంతా ఆశ్చర్యపడిపోయారు. అద్భుతంపడిపోయారు. రాజు దీర్ఘాయువుదిక్కు ముఖమై ఇట్లా అనా: "తాత దీర్ఘాయువు! మీతండ్రి చచ్చిపోతూ, చచ్చిపోతూ" "తాత! దీర్ఘాయువు! చిన్నదాన్ని పెద్దదాన్ని పట్టించుకోకు. వైరంచేత వైరం అంతం చెందదు. అవైరంచేతనే! తాత! వైరం అంతం అవుతుంది." అన్నాడు గదా! ఏమి ఆలోచించి అట్లా అన్నాడంటావు?"

"మహారాజా! నాతండ్రి దీధితి నన్ను పెద్దదాన్ని పట్టించుకోవద్దన్నాడు. అప్పుడు ఆయన అన్న ఈమాటలకు అర్థం "నాయనా! దీర్ఘాయువు! చిరవైరాన్ని పెంచుకోకు" అని, దీర్ఘవైరంవల్ల ఎట్టిమేలు ఎవరికి కల్గదని ఆయన తెలుసుకొని అట్లా చెప్పారు. మహారాజా! తర్వాత చిన్నదాన్ని పట్టించుకోవద్దన్నారు. అంటే మిత్రులువుంటే, వారితో ఆట్టే తగాదాలు పడవద్దు అని ఆదేశం ఇచ్చినట్లు నాకు అనంతరం, అనంతరం అర్థమైంది. మిత్రులతో కలహం పెట్టుకోవడం తగదని ఆలోచించే ఆయన అట్లా చెప్పారు. ఆ అనంతరం, మహారాజా! మాతండ్రిగారు అన్నారు గదా "నాయనా! వైరంచేత వైరం అంతంకాదు. పగచేత పగ అణగదు" అని. మీరు నాతల్లిని తండ్రిని

(56 వ పేజీ చూడండి)



ఎల్లు కాలిల సమ్మె ఐయిమై చర్చిస్తున్నారు

రోహిణీవారి "బీదల ఆస్తి" లో రాజనాల, జానకి, గుమ్మడి వెంకటేశ్వరరావు

# ★ సినిమా పరిశ్రమ సమస్యలు ★

ఇటీవల సినిమాలపైనా, సినిమా పరిశ్రమపైనా మళ్లీ గాలిదుమారం రేగింది. భారత ఫిలిం ఫెడరేషన్‌వారు ఈ నెల 5 వ తేదీన దేశమంతటా ఫెడరేషన్ దినోత్సవం జరిపారు. సినిమాపరిశ్రమకు చెందిన నిర్మాతలు, స్టూడియో యజమానులు, డిస్ట్రిబ్యూటర్లు, ఎగ్జిబిటర్లు, సినిమా పరికరాల దిగుమతిదారులు మొదలైన యావన్మందిన్ని, సినిమాపట్ల ప్రభుత్వంవారనుసరించే విధానాన్ని ఏకకంఠంగా నిరసిస్తున్నారని చూపడమే ఈ ఉత్సవ ఆశయం. దేశంలోని ప్రధాన సినిమా పారిశ్రామిక కేంద్రాల్లో భారీ ఎత్తున ఈ ఉత్సవం జరిగింది. మద్రాసులో జరిగిన ఉత్సవంలో దాదాపు సినిమా వ్యక్తులు యావన్మందీ పాల్గొన్నారు. జెమినీ అధిపతి ఎస్. ఎస్. వాసన్‌గారు సినిమాలవారికి సారథ్యం వహించారు. వాహినీ స్టూడియోలో జరిగిన సభలో ఆయన, సినిమా పరిశ్రమకు జరుగుతున్న అన్యాయాన్ని ఖండించారు ఈ సభలో మద్రాసు ముఖ్యమంత్రి రాజగోపాలాచారిగారు కూడా పాల్గొనడంతో దానికి ఒక ప్రత్యేకత వచ్చింది. వాసన్‌గారికి పాయింట్‌వారీగా రాజాజీ సమాధానాలిచ్చారు. ఇద్దరి ఉపన్యాసాలలోనూ కొత్తవిషయాలేమీ లేవు. కాని వాదనాపటిమ, మహత పేచీలు వేసి ఎదటివారిని పల్టీచేసే తార్కిక ప్రజ్ఞగల రాజాజీ తన ఉపన్యాస ప్రభంజనంతో వాసన్‌గారి పాయింట్లన్నిటినీ ఊడిచిపెట్టేశారు. వాసన్‌గారి వాదాన్ని ఒప్పుకుంటున్నట్లే ఒప్పుకుంటూ, చదరంగంలో ఎత్తుకు పైఎత్తు వేసినట్లు ప్రతి అంశానికీ తిరుగు జవాబు చెబుతూ, చల్లగా మెల్లగా సినిమాలవారందరినీ హాస్యాస్పద పరిస్థితిలో పెట్టి, మొత్తానికి రాజాజీ ఆరోజు తనదే పైచెయ్యి అనిపించుకున్నారు

ఈ దుమారంలోంచి బయటకువచ్చి తాపీగా ఆలోచిస్తే సినిమా పరిశ్రమ ఈనా

# సినిమా పరిశ్రమ సమస్యలు

ఉన్నంత అరాజక పరిస్థితిలో ఏనాడూ లేదని ప్రతివారికీ స్పష్టపడుతుంది. సినిమా వ్యాపారం పెరిగినకొద్దీ అరాజకం కూడా పెరుగుతోంది. సినిమా పారిశ్రామికులు ఎన్ని సభలు చేసినా, ఎన్ని ఉత్సవాలు జరిపినా వారిలో వారికి ఐకమత్యం ఉన్నదని ఎవరినీ నమ్మించలేరు. సినిమా పరిశ్రమలోని వివిధశాఖలమధ్య ఉన్నంత పోటీ మరే పరిశ్రమలోనూ లేదు. ఈ శాఖలన్నీ ఒకదాని అభివృద్ధిమీద ఒకటి ఆధారపడి వున్నప్పటికీ, ఒకదాన్నొకటి కబళించే స్థితిలో వున్నాయిగాని పరస్పరం సహకరించుకునే స్థితిలో లేవు. వివిధశాఖలమధ్య ఐకమత్యం సాధించాలని ఫిలిం ఫెడరేషన్ ఒకటి రెండేళ్లుగా చేస్తున్న ప్రయత్నాలన్నీ వ్యర్థమైనాయి. "సెల్ఫ్ రెగ్యులేషన్" ప్రతిపాదనపై నెలల తరబడి తర్జన భర్జనలు జరిగిన తరవాత, కిందటినెల మద్రాసులో సమావేశమైన ఫెడరేషన్ కార్యవర్గంవారు ఆ ప్రతిపాదనను మళ్ళీ వెనక్కినెట్టేశారు. సభ్యులలో "సెల్ఫ్ రెగ్యులేషన్" విషయమై ఏకాభిప్రాయం కుదరనందున దాన్ని ప్రస్తుతం వాయిదా వేశామని అధ్యక్షుడు బి. ఎన్. సర్కార్ ప్రకటించారు. ఈ ప్రతిపాదనకు ముఖ్యంగా మద్రాసు సభ్యులు వ్యతిరేకించారని తెలుస్తున్నది. తమ ఇళ్లు తాము చక్కబెట్టుకొనే విషయంలో, అందులోనూ అందరికీ లాభించే "సెల్ఫ్ రెగ్యులేషన్" విషయంలోనే ఇన్ని భిన్నాభిప్రాయాలున్నప్పుడు, సినిమా పారిశ్రామికులు తమ సమస్యలన్నిటికీ ఇతరులదే బాధ్యత అని తప్పుకోవడం భావ్యం కాదు.

నూటికి తొంభై చిత్రాలు తమ డబ్బు తాము రాబట్టుకోలేని స్థితిలో వున్నాయి. ఆరునెలలకంటె ఎక్కువ నిర్మాణకాలం అవసరంలేని చిత్రాలు ఏడాది రెండేళ్లు పుచ్చుకుంటున్నాయి. ఒకే తార, ఒకే దర్శకుడు, ఒకే సంగీత దర్శకుడు ఒకేసారి



అసోసియేటెడ్ ప్రొడ్యూసర్సువారి "ఆశైమగన్" తమిళ చిత్రంలో ఒకదృశ్యం.

**శాంతాంబ, సేతు, శంకరపల్లి, రామస్వామి, శివకూరయ్యన్**



బందీ అయిన కథానాయకుణ్ణి విడిపించడానికి బలే పన్నాగం పన్నారు.

**రోహిణీ వారి "ప్రతిజ్ఞ" లో సీత, సావిత్రి మున్నగువారు.**

అనేక చిత్రాల్లో పనిచేస్తున్నారు. వారి రేట్లు మూడింతలు నాలుగింతలుగా పెరిగి పోతాయి. వారానికి రెండేసి చిత్రాల చొప్పున పోటీగా విడుదలవుతున్నాయి. నిర్మాణవ్యయం అతిగా పెరిగింది. ఈ శోచనీయ పరిస్థితులకు కారణం సినిమా పారిశ్రామికులే కాని మరెవరూ కాదు. వీటిలో, చిత్రం జయాపజయాలను తప్ప, ప్రతిఒక్కదాన్ని నిర్మాతలు కంట్రోల్ చెయ్యడానికి వీలున్నది. అయినా వారు కిమిన్నాస్తిగా ఊరుకుంటున్నారంటే వారిలో వారికి ఎంత అనైక్యం పెరిగిందీ ఊహించుకోవచ్చును.

సినిమాలపై ప్రభుత్వం విపరీతంగా పన్నులు వేస్తున్నదనీ, ఎంత లాభం తీసిన చిత్రమైనా ఈ పన్నుల మూలంగా నష్టపడుతున్నదనీ, అందువేత పెట్టుబడిదారులు పరిశ్రమలో డబ్బు పెట్టడానికి జంకుతున్నారనీ, ఇలాగయితే పరిశ్రమ నశించిపోతుందనీ వాసన్ ప్రభృతులు అంటున్నారు. పరిశ్రమ నశించిపోతుందనే భయానికి ఆధారమేమీ లేదు. ప్రజలకి వినోదం, కాలక్షేపం అవసరమైనన్నాళ్లూ సినిమా పరిశ్రమ ఉంటుంది. నిరంతరంగా, పకడ్బందీగా చిత్రాలు నిర్మించేవారికి పరిశ్రమలో స్థానం ఎల్లప్పుడూ వుంటుంది. ఇక చేతులో నాలుగు రాళ్ళు ఆడుతూ వుండి సినిమా జూదం ఆడదలచేవారు మాత్రం వస్తూ పోతూంటారు పోతూనే వుంటారు. వీరికోసం ఎవరూ విచారించవలసిన అవసరం లేదు. సినిమా పరిశ్రమపై పన్నుల భారం అధికంగా వున్నమాట నిజమే. ఇంత ఎక్కువ పన్నులు చెల్లించే పరిశ్రమ ఇంకోటి లేదని ఎ. రామయ్యగారన్నారు. అయితే అతి స్వల్పకాలంలో ఇన్ని రెట్లు లాభాలు ఆర్జించగల పరిశ్రమకూడా ఇదే. మరే యితర పరిశ్రమకూ యిన్నిరెట్లు లాభాలు ఆర్జించే శక్తి లేదు. వాసన్‌గారు తీసిన చంద్రలేఖపై ఆరు రెట్లు రాబడి వచ్చిందని ఆయనే చెప్పారు. ఈ రాబడిలో స్వల్పభాగమే వాసన్‌గారికి దక్కినప్పటికీ, మిగతాది సినిమా పరిశ్రమలోని ఇతర శాఖలకే పోయిందిగాని మరెవరికీ పోలేదుగదా. సినిమా పరిశ్రమలో ఐకమత్యమే వుంటే ఆ ధనాన్ని తమ సమిష్టి ప్రయోజనాలకు తామే ఎందుకు ఉపయోగించకూడదు? చిన్న నిర్మాతల సహాయార్థం పెట్టుబడినిధులను ఏర్పాటు చేసుకోవచ్చుగదా. పరిశ్రమ అభివృద్ధికి సహాయం చెయ్యమని ప్రభుత్వాన్ని కోరడంకంటె హాస్యాస్పదం మరొకటి లేదు. ఏభైకోట్ల రూ.ల పెట్టుబడితో నడుస్తున్న సినిమా పరిశ్రమ తనకు తాను సహాయం చేసుకోలేని స్థితిలో లేదంటే ఎవరూ నమ్మరు. ఫైనాన్సు కార్పొరేషన్ స్థాపించడం దగ్గిర్నుంచి టెక్నీషియన్లను తర్ఫీదు చేయడం వరకూ అన్ని పనులూ సినిమా పారిశ్రామికులు తమకు తాము

(50—వ పేజీ చూడండి)

# ప్రశ్నలు..సమాధానాలు

—శ్రీ పి యం. వి. యల్ నరసింహం
బద్వేల్.

సాంఘిక, పౌరాణిక చిత్రాలే మన దర్శకులు తీస్తారు కానీ రాజకీయాలకు సంబంధించిన చిత్రాలు తీయకపోవడానికి కారణం?

—రాజకీయాలు సాంఘిక విషయాలే కనుక సాంఘిక చిత్రాల్లోనే రాజకీయాలను కూడా చొప్పించవచ్చును; అచ్చ గా రాజకీయ చిత్రాలే తీయ నవసరం లేదు

*   *   *

శ్రీ యం యస్ ఆర్ శాల్, గద్వాల్—

అమెరికా గవర్నమెంటుకు "Uncle Sam" అను పేరు ఏ విధంగా వచ్చినది దాని అర్థమేమిటో తెలుపండి

—అమెరికా అని మనం వ్యవహరించే దేశాన్ని ఇంగ్లీషులో యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా లేక క్లుప్తంగా U. S అంటారు U.S అనే అక్షరాలను చమత్కారం కోసం విస్తరించి Uncle Sam చేశారు కొంచెం పెద్దమనిషిగా పెలాపుణీ అయ్యే వాణ్ణి ఇంగ్లీషు వాళ్లు uncle అని వ్యవహరిస్తూంటారు అమెరికా వారు తాము ప్రపంచ నాయకత్వానికి తగినవారమని చాటుకొంటూ వుంటారుగనుక ఆ ప్రభుత్వానికి Uncle Sam అనే పేరు స్థిరపడిపోయింది

*   *   *

శ్రీ రాయని లక్ష్మీనారాయణ—
విజయవాడ

దేవదాసు (హిందీ) మ్యూజిక్ డైరక్టరు ఎవరు?

—ప్రఖ్యాత బెంగాలీ గాయకుడు, సంగీతకారుడు శ్రీతిమిర్ బరన్ భట్టాచార్య

గేవాకలర్‌కు, టెక్నికలర్‌కు గల వ్యత్యాసము లేమిటి?

—టెక్నికలర్‌లో మూడు రంగుల నెగటివ్‌లు ఉపయోగిస్తారు ఈ మూడింటినీ ఒకదానిపై ఒకటి సూపర్ ఇంపోజ్ చేసి ఒక పాజిటివ్ ప్రింట్ తీస్తారు. గేవా కలర్‌లో ఒకే నెగటివ్ ద్వారా అన్ని రంగులూ తెప్పిస్తారు

*   *   *

శ్రీ జి. శ్రీ ...... —...టూరు

మన తెలుగు చిత్రాలలో సెన్సారుబోర్డు వారు ప్రేమికులు ముద్దులు పెట్టుకొనుటకు అనుమతిస్తే సినిమా ప్రపంచం ఏవిధముగా మారుతుంది

—తెలుగు చిత్రాల్లో ఇప్పటికే ప్రేమ ఎక్కువగా ఉన్నది ముద్దులు కూడా అనుమతిస్తే ఇక పట్టశక్యం కాదు ప్రేమ భావ ప్రకటనలో ఎక్కడో ఒకచోట సరిహద్దు గీత గియ్యాలి సెన్సార్ వారు ముద్దుల వద్ద ఈగీత గీశారు ఈగీత లేకపోతే ప్రేమ ప్రకటన ఇప్పటికంటే ఎక్కువగా వెర్రి తలలు వేస్తుంది.

*   *   *

శ్రీ ఎ మోహనరావు—నిడదవోలు.

సినిమాలు విడుదల కాకపూర్వమే కథలను పత్రికల్లో వేయుదురు గదా, ఆకథలను చాలా మంది చదువుదురు మరి కథను చదివిన తరువాత సినిమా చూచుటకు కొంత మందికి ఆసక్తి వుండదుకదా మరి యెందుచేత ముందర నే కథలను వేయుదురు?

—సినిమాలలో ప్లాటు ముఖ్యం కాదు సారస్వతంలో ప్లాటుకంటె రచనా విధానం, శైలి ఎలా ముఖ్యమో, అలాగే సినిమాల్లో ప్లాటుకంటె చిత్రణ విధానం ముఖ్యం ఈచిత్రణ విధానాన్నే దర్శకత్వం అంటాము ఒక మంచి నవలను ఎన్నిసార్లయినా చదివి ఎలా ఆనందిస్తామో అలాగే ఒక గొప్ప చిత్రాన్ని ఎన్నిసార్లయినా చూసి ఆనందించవచ్చు. కథ ముందు తెలిసిఉన్న కారణంచేత చిత్రం మనకి ఆనందం కలిగించలేదనుకోండి. ఆచిత్రం తక్కువ రకం చిత్రమన్నమాట

*   *   *

శ్రీ దొప్పలపూడి సాంబశివరావు—
తెనాలి

సాధనా పిక్చర్స్‌వారి "ప్రపంచం" చిత్రం ప్రేక్షకులను మోసం చేసిందంటాను మీరేమంటారు?

—"ప్రపంచం" చిత్రం చూసిన ప్రేక్షకు లెవరూ దాని బాగోగుల విషయంలో మోసపోలేదు ప్రేక్షకుల తెలివితేటల విషయంలో ఆ చిత్రమే మోసపోయింది



"దో బిఘా జమీన్" చిత్రంలో బలరాజ్ సహానీ, నిరూపారాయ్

శ్రీ ఓరుగంటి రామకృష్ణారావు—
కలకత్తా.

"శైలా-బాలరా" చిత్రంలో మీనాకుమారి "ఈతరానివారు వచ్చినవారి ప్రాణములను కూడా తీయరాదు"రని చెప్పి నిరూపించింది. ఐతే చిత్రం నీతి అదే నంటారా?

—ఆచిత్రం చూసిన వారెవరికీ తట్టనినీతి మీకు తట్టినందుకు మిమ్మల్ని అభినందించాలి. ఆచిత్రం నుంచి మీరు నేర్చిన నీతి అదే అయితే, దాని కోసం అన్ని వేల అడుగుల సెల్యులాయిడ్ ఖర్చు చేసినందుకు విజయభట్ తప్పక పశ్చాత్తాపపడతారు.

*    *    *

శ్రీ వి. జస్వంత్—కవుతరం.

'సింఫొనీ' అంటే ఏమిటండీ? గౌరీశంకర్ శిఖరంమీద శివ-పార్వతులున్నట్లు ఇంకా నమ్ముతున్నారా? (మానవుడిచేత ఆ శిఖరం జయించబడ్డ తర్వాతకూడా)

—(*Symphony*) అనేది యూరోపియన్ సంగీతానికి చెందినది. సింఫొనీ సంగీతంలో అనేక రకాల వాయిద్యాలు (ఆర్కెస్ట్రా) ఉపయోగించబడతాయి; విశాలమైన శైలి వృత్తం వుంటుంది.

గౌరీశంకర్ శిఖరంమీద శివపార్వతులు లేరని మీరూ, మేమూ వాదించినా, "ఉన్నారు; భక్తులకు కనిపించరు," అని వాదించే భక్తులు చాలామంది వుంటారు. ఈవిషయంపై అంతిమ నిర్ణయం ఎవరికి వారు చేసుకోవలసిందే.

*    *    *

శ్రీ కె. గురుసామిరాజా—చిత్తూరు.

మీ దృక్పథాన్ననుసరించి ప్రతి చిత్రములో 'తప్పులంటూ వుండకపోవు.' మీ సమీక్షలో 'దేవదాసు' ఒక నిసర్గ మనోహరమైన చిత్రంగా పేర్కొన్నారు. అంతే కాదు. పాఠకులు పేర్కొన్న తప్పులు (మద్యనిషేధము మొదలు తెలుగువారు సంగీతమువరకు) బుద్ధిపూర్వకంగా సమర్థించారు. మీరు చెప్పినవన్నీ రైటే. మరి 'దేవదాసు' 'తప్పులంటూ వుండక పోవు' అన్న భావానికి గురికాదు కాబట్టి మీ అభిప్రాయాన్ని మార్చుకుంటారా?

—"నిసర్గమనోహర"మని మేము పేర్కొన్నది ఆ చిత్రాన్ని కాదు; శరత్ కథలోని చంద్రముఖి పాత్రను. మా సమీక్ష మళ్ళీ చదివితే, ఆ చిత్రం పూర్తిగా నిర్దుష్టమని మేమనలేదని గ్రహించగలరు. కొన్ని లోపాలు ఆ సమీక్షలో పేర్కొనబడినవి. విమర్శకుల దృష్టి నైశిత్యాన్ని బట్టి ఇంకా ఎన్ని లోపాలైనా బయటపడతాయి. ఇటీవల వెలువడే పరుపుకంటె "దేవదాసు" బాగున్నదని మాత్రమే మా అభిప్రాయం. కనుక మా అభిప్రాయం మార్చుకోవలసిన అవసరం లేదుకదూ.





పారమౌంట్ వారి "బోటనీ బే" టెక్నికలర్ చిత్రంలో ఒకదృశ్యం.



కాశ్యప్ ప్రొడక్షన్స్ వారి "నయాఘర్" హిందీ చిత్రంలో బీగంపారా, గీతాబాలి దర్శకుడు డి డి కాశ్యప్; సంగీతం శంకర్—జైకిషన్. విడుదల స్టార్ టాకీస్

## సినిమా పరిశ్రమ సమస్యలు

(47-వ పేజీ తరువాయి)

చేసుకోవచ్చును గానీ ఏకీభావంతో వ్యవహరించసాగిననాడు ప్రభుత్వం ఆ పోయ నిరాకరణం చేస్తుందనడానికి ఆస్కారంలేదు

నిర్మాతలవద్ద డబ్బులేదనే వాదనకూడా సామాన్యప్రజలకు అర్థంకాదు సినిమా పరిశ్రమలో జరిగే దూబరాఖర్చు జగద్విదితం వాసన్‌గారు 65 లక్షలతో "చంద్రలేఖ" నిర్మించి విజయం పొందారు తరవాత చిత్రాల్లో ఆట్టే విజయం పొందికపోయినా వాసన్‌గారు మరికొన్ని మిలియన్లలో "అవ్వయ్యార్" చిత్రం తీశారు మొన్న మొన్ననే హెచ్ ఎమ్ మూనాస్ అనే నిర్మాత పాతిక లక్షలతో ఒక చిత్రం తీశారు మరొక సంస్థవారు తమ జానపద చిత్రంపై ఇప్పటికే మిలియన్సైన కొన్ని లక్షలు ఖర్చుపెట్టారు అయిదు లక్షలకంటె తక్కువ నిర్మాణవ్యయం అవసరంలేని కొన్ని చిత్రాలు తొమ్మిది, పది లక్షల ఖర్చుతో ఈ ఏడాది వెలువడ్డాయి ఖర్చుకు తగిన ప్రొడక్షన్, టెక్నికల్ విలువలులేని ఈ చిత్రాలకు జరిగే దూబరాఖర్చు మాత్రమే నిర్మాతలవద్ద డబ్బులేదని ఎవరూ నమ్మరు ఉన్న డబ్బును సద్వినియోగంచేసే సామర్థ్యం వారివద్ద లేదని మాత్రమే నమ్ముతారు ప్రతి కథా తక్కువఖర్చుతో తీయడానికి వీలులేనిమాట నిజమే చంద్రలేఖ, పాతాళభైరవి లాంటి చిత్రాలను సాధారణ వ్యయంతో తీయడానికి వీలులేదు లోకంలో ఎక్కడా జరగని అసాధారణ విషయాలను చిత్రించే చిత్రాలకు అసాధారణ వ్యయం ఎలాగూ తప్పదు అయితే సాధారణ విషయాలుగల సాంఘిక చిత్రాలు కూడా అసాధారణ వ్యయంతో తయారు చేయడానికి కారణమేమిటి?

## చౌకలో చిత్రనిర్మాణం

సినిమా పరిశ్రమ తాలూకు సమస్యలన్నిటినీ పడబోస్తే, చిత్రాల నిర్మాణ వ్యయానికీ వాటి లాభనష్టాలకీ అవినాభావ సంబంధం ఉన్నదని తేలుతుంది ఎక్కడో అరుదుగా ఒక చిత్రం పదిలక్షలు ఖర్చుపెట్టి యాభైలక్షలు సంపాదించి వుండవచ్చు కాని ఏడాది పొడుగునా తయారయ్యే రమారమి 30 చిత్రాలూ పదిలక్షల్లో, లేక అయిదు లక్షల్లో ఖర్చుపెడితే అన్నీ అయిదేసి రెట్లచొప్పున బాక్సాఫీసు వద్ద వసూలు చేసుకోగలవా? అసంభవం. ఏ రెండు మూడు చిత్రాలకో అత్యధికంగా వసూలవుతుంది మిగతా చిత్రాలు నిర్మాణ వ్యయం కూడా రాబట్టుకోలేని స్థితిలో వుంటాయి ఆ 30 చిత్రాలూ అద్భుతంగా ఉన్నాయనుకున్నప్పటికీ వాటి డబ్బు వాటికి రాదు అందుచేత చిత్రాల సంఖ్య పెరుగుతూ, ప్రజలు వినోదానికి చెల్లిం

డబ్బు పరిమితంగా వున్నంతకాలమూ చిత్ర నిర్మాణ వ్యయం క్రమేపీ తగ్గించుకుంటూ రావడమొక్కటే మార్గాంతరం

బెంగాల్, మహారాష్ట్రలలో చిత్రాలు త్వరగానూ, చవకగానూ తయారవుతాయని మనకి తెలిసినదే అక్కడి స్టూడియోలకి పనిలేదనీ, ఆర్టిస్టులు చవుకగా వస్తారనీ, తయారైన టెక్నీషియన్లు చాలమంది వున్నారనీ, కలిసికట్టుగా పనిచేస్తారనీ, ఈ కారణాలవల్ల ఆ రాష్ట్రాల్లో చవకచిత్రాలు తయారవుతాయనీ / ఒకవాదం ఉన్నది అక్కడ స్టూడియోలకు పనిలేదన్న మాట నిజంకాదు ఆ ప్రాంతాల్లో ఇదివరకుకంటె అధికంగా చిత్రాలు తయారవుతున్నాయి వాటిలో ఎక్కువభాగం చవకవిగా బాక్సాఫీస్‌వద్ద పెద్ద విజయాలు పొందుతున్నాయని కూడా వార్తలవల్ల తెలుస్తోంది ఇక అక్కడ ఆర్టిస్టులు చవకగా రావడానికి, కలిసికట్టుగా పని చెయ్యడానికి, ఇక్కడివారు అలా కాకపోవడానికి సబబైన కారణమేమీ కనిపించదు వారి ఆర్టిస్టులకంటె మన ఆర్టిస్టులు పాడిచేసినదేమీ లేదు కనుక తెలుగుకి సంబంధించినంతవరకూ బెంగాల్, మహారాష్ట్రలలోవలె చవక చిత్రాలు తయారుకాకపోవడానికి కారణం కనిపించదు

ప్రస్తుత పరిస్థితుల్లో చౌకచిత్రాలు తయారుకావడం అసంభవమని కొందరంటున్నారు పరిస్థితులను చూసి బెదిరినన్నాళ్లూ పరిస్థితులిలాగే వుంటాయి పరిస్థితులిలా వున్నాయి కనుకనే చౌకచిత్రాలు తయారవ్వాలనే వాదన బయలుదేరింది. పరిస్థితులు మరోవిధంగా వుంటే ఈ వాదనకు ఆస్కారమే లేదు.

చౌకలో చిత్రాలు తీసే అర్హతలు అందరికీ ఉండవని కొందరు వాదిస్తున్నారు అయిదు లక్షలలో, పదిలక్షలలో చిత్రాలు తీసే అర్హత ఇందరికి ఉండగా లేనిది, రెండు లక్షలలో చిత్రం తీసే అర్హత అందరికీ ఎందుకు ఉండరాదు? మంచి చిత్రాలు తీయడానికి కొన్ని ప్రత్యేకార్హతలు కావాలన్నమాట నిజమే ఆ అర్హతలు అందరికీ ఉండవన్నమాటా నిజమే కాని పదిలక్షలలో తీసే చిత్రాలన్నీ మంచి చిత్రాలేనని చెప్పగలమా? వాటిలో ఎక్కువభాగం చెడ్డవి లేవా? అలాగే చవక చిత్రాలలో కూడా కొన్ని మంచివి, కొన్ని చెడ్డవి ఉండి తీరుతాయి మంచి చిత్రాలకు అధికలాభాలు వస్తే రావచ్చు చెడ్డ చిత్రాలకు పెద్ద లాభాలు రాకపోయినా, చవకలో తీయబడినవి కనుక కనీసం పెట్టుబడినైనా రాబట్టుకుంటాయి పదిలక్షల పెట్టుబడితో అపజయం పొందినవాటిలాగ పూరిగా తుడిచి పెట్టుకుపోవు చవకబారు చిత్రం తయారయ్యే ప్రమాదం చవక చిత్రాలకూ, ఖరీదైన చిత్రాలకూ సమానంగా ఉంటుంది ఖరీదు ఎక్కువైన కొద్దీ చిత్రంస్థాయి పెరుగుతూ పోదు



"నయాఘర్" లో బేగంపారా, శేఖర్

ఏపని చెయ్యడానికైనా కొన్ని కనీస అర్హతలు కావాలి ఈసూత్రం చవక చిత్రాల నిర్మాణానికి కూడా వర్తిస్తుంది "ఇంతకంటె నేను దమ్మిడీ కూడా ఎక్కువ ఖర్చుపెట్టను" అని నిర్మాత గట్టితీర్మానం చేసుకొని రంగంలోకి దిగాలి ఈ తీర్మానానికి అనుగుణమైన కొన్ని త్యాగాలు అతను చేయవలసివుంటుంది పెద్దతారల మీద మోజు వదులుకోవాలి పెద్దపెద్ద సెటింగులూ, ఖరీదైన దుస్తులు, బోలెడు పాటలూ, బోలెడు మడిషిల్మ్స్, బోలెడు కాల్‌షీట్లు వగైరా ఖర్చు అవసరంలేని కథ ఎంచుకోవాలి "ఇవేమీ లేకపోతే చిత్రం దెబ్బ తింటుంది" అని ఎవరన్నా అంటే, ఇవన్నీ వుండి కూడా దెబ్బతిన్న చిత్రాలను చూపించాలి

కొత్త నటీ నటులయితే త్వరగా పని [illegible]దవి, కాల్‌షీట్లు దండగవుతాయనీ [illegible]ందరి వాదన మంచి ఆర్టిస్టులు పాత [illegible]ర్లలోనే వుంటారన్న మాట అబద్ధం.

పత్తా ధర్మాధికారి తన చిత్రాలలో ఎక్కువగా కొత్తవారినే ఉపయోగిస్తున్నాడు. వారు బాగా నటించలేరని ఎవరూ అనలేదు. తెలుగునటి జానకి తన మొదటి చిత్రంలోనే (షావుకారు) బాగా నటించా ననిపించుకొంది. ఖచ్చితంగా రిహార్సల్ చేసుకున్న తరవాత సెట్ మీదికి వస్తే అదే పనిగా రీటేకులు తీస్తూపోనవసరం లేదు. నిజానికి, కాల్‌షీట్లు దండగయ్యేది పేరు పొందిన పాత తారలవల్ల, సరియైన స్క్రిప్టు లేకపోవడం వల్ల అని అందరికీ అనుభవమే. చౌకలో చిత్రాలు తీయాలనుకున్న వారు కొత్త నటీనటులను, కొత్త డైరెక్టర్లను కొత్త మ్యూజిక్ డైరెక్టర్లను, కొత్త రచయితలను తీసుకుని ఎందుకు సాధించలేరు? పాతవారిలోనే గొప్ప పని వాడితనం వుంటుందనడానికి ప్రస్తుత చిత్రాలు ఏవిధంగానూ ఆస్కార మివ్వడం లేదే?

చౌకలో చిత్రాలు నిర్మించడాన్ని గురించి నిర్మాతలు, పెట్టుబడి దారులు శ్రద్ధంగా ఆలోచించడం ఎంతైనా అవసరం. ఇది అసంభవమని నిర్లక్ష్యంగా పెదవులు విరవవలసిన ప్రతిపాదన కాదు. ముఖ్యంగా కొత్త నిర్మాతలు ఈవిధంగా సాహసించడంవలన సినిమాపరిశ్రమను పునరుజ్జీవింప జేసినవారవుతారు.

★



## ★ సినిమా వార్తలు ★

బొంబాయిలో యిటీవల కొందరు నిర్మాతలుకలిసి ఒక కొత్తసంఘం ఏర్పరచుకొన్నారు. ఈ సంఘంలో శాంతారాం, మెహబూబ్, కర్దార్, రాజకపూర్, సోలారాం బలన్, జె. బి. హెచ్. వాడియా, శంకర్‌లాల్ భట్ మొదలగు వారున్నారు. ఆర్థిక మాంద్యాన్ని, పన్నులభారాన్ని ఎదుర్కోవడం, చిత్రాల కళాస్థాయి, నైతికస్థాయి పెంపొందించడం, నిర్మాణ వ్యయం తగ్గించడం, స్టార్ సిస్టమ్ రద్దుచేయడం, వీలైతే ఒక సినిమా ఎకాడమీ నెలకొల్పడం మొదలైన ఆశయాలతో ఈసంస్థ ఏర్పడింది. సంఘ నియమాలను ఉల్లంఘించే నిర్మాత అపైన, తారలపైన ఆంక్షలు విధించే అధికారంకూడా ఈ సంఘాని కివ్వబడింది. చిత్ర నిర్మాణంలో పనిచేసేవారికి ఉద్యోగాలభద్రత ఉండేటట్లుకూడా ఈసంఘం ప్రయత్నిస్తుంది.

*　　*　　*

అశోక్‌కుమార్ ప్రొడక్షన్స్‌వారి "పరిణీత" హిందీచిత్రం పూర్తయిందట. శరత్ బాబు రచించిన నవల ఆధారంగా ఈ చిత్రాన్ని ప్రసిద్ధ దర్శకుడు బిమల్‌రాయ్ డైరెక్టు చేశాడు. కథానాయకుడు శేఖర్‌గా అశోక్‌కుమార్, నాయిక లలితగా మీనాకుమారి నటించారు. ఈ చిత్రంలో గిరీన్ పాత్రను బెంగాలీ నటుడు అసిత్‌బరన్ ధరించాడు. సంగీత దర్శకుడు అరుణ్ కుమార్. ఈ చిత్రం పెద్ద విజయం పొందవచ్చునని పలువురు ఆశిస్తున్నారు. అశోక్ కుమార్ తాను నిర్మించబోయే రెండవ చిత్రానికి కూడా తిరిగి బిమల్‌రాయ్‌నే డైరెక్టరుగా బుక్ చేశాడట.

*　　*　　*

జెమినీవారి "అవ్వయ్యార్" తమిళ చిత్రం గత శనివారం మద్రాసులో మూడు థియేటర్లలోనూ, తమిళనాడులో 60 థియేటర్లలోనూ, విడుదలయింది. నిర్మాత వాసన్: డైరెక్టరు కొత్తమంగళం సుబ్బు. ప్రాచీన కాలంలో తమిళదేశంలో భక్తి, జ్ఞానం వెదజల్లిన ఒక యోగిని జీవితకథ ఈ చిత్రంలో వస్తువు. యోగిని అవ్వయ్యార్‌గా కె. బి. సుందరాంబాళ్ నటించింది. భారీ ఎత్తున సెటింగులతోను, ప్రొడక్షన్ విలువలతోను, తమిళప్రజలకు సుపరిచితమైన కథతోను తయారైన ఈ చిత్రం బాగా ఆర్థికవిజయం పొందవచ్చునట.

*　　*　　*

అశ్వరాజ్ ప్రొడక్షన్సువారి మొదటి చిత్రం సెప్టెంబరు మూడవ వారంలో సెట్సుకు వెళుతుందని తెలుస్తోంది. ఈ చిత్రంలోకి నాగేశ్వరరావు, అంజలీదేవి, ఎస్. వి. రంగారావు బుక్ అయ్యారట. దర్శకత్వం వేదాంతం రాఘవయ్య; సంగీతం ఆదినారాయణరావు; నిర్మాత కె. గోపాలరావు.

*　　*　　*

యునైటెడ్ టెక్నీషియన్స్ ఎండ్ శ్యామలావారి "పల్లెపడుచు" దాదాపు సగం తయారైందని తెలుస్తోంది.

*　　*　　*

ఎవరెస్ట్ శిఖరంపై విజయం సాధించిన టెన్సింగ్ జీవితకథను రాజ్‌కపూర్ సినిమా తీయాలని సంకల్పించాడు. టెన్సింగ్ ఇటీవల యూరప్ యాత్రనుండి తిరిగి బొంబాయి వచ్చినప్పుడు రాజ్ కపూర్ అతన్ని కలుసుకొని కథావివరాలను గూర్చి చర్చించాడట. ఈ విషయమై తానింకా ఆలోచించవలసివున్నదని టెన్సింగ్ సమాధానం చెప్పాడట.

*　　*　　*

విజయభట్ నిర్మిస్తున్న హిందీ చిత్రం "మహాప్రభు చైతన్య"లో చైతన్యుని భజన కీర్తనలను పాడడానికి బెంగాలీ గాయకుడు ధనంజయ భట్టాచార్య బుక్ అయ్యాడు. భారత్‌భూషణ్, అమితా అనే కొత్త నటి ప్రధాన పాత్రధారులు. న్యూథియేటర్సువారి అనేక చిత్రాలకు సంగీతదర్శకుడుగా పనిచేసిన ఆర్. సి. బోరల్ ఈ చిత్రానికి భక్తిభావస్ఫోరితమైన సంగీతం సమకూరుస్తున్నాడు.

# ★ 1 + 1 = 0 ★

(9 వ పేజీ తరువాయి)

విషం ఇచ్చి చంపాడు పేషంట్‌ని ... మిత్రుణ్ణి!

'మిత్రుడు! - పల్లి కోరికాదు. వాడు... తన జీవితాన్ని అడవుల పాలు చేశాడు. తన లతని చంపాడు! ... తాను పగ తీర్చు కున్నాడు - అంతే.

ఇదా పగతీర్చుకోడం? తన చేతిలో తన ప్రాణాన్నుంచినవాడిని, విషం ఇచ్చి చంపడం - ఎవరు సంతోషించే పగ?

తన చేతులు...

ఆ చేతులతోనే మధ్యాహ్నం ఎర్రసీసా, నీలిసీసాలలోని పౌడర్లు తారుమారు చేశాడు - ఆ చేతులతోనే ప్రిస్క్రిప్షన్ రాశాడు. ఆ చేతులతోనే శేఖర్‌ని చంపాడు!

ఎంతఘోరం చేశాడు! ... జుత్తు పీక్కున్నాడు. కళ్లు కనిపించకుండా చేసుకుని హత్య చేశాడు! ... కాని, అంతా జరిగి పోయింది! ఈ పరికి శేఖర్ గుడ్లు తేలవేసి ఉంటాడు...

తాను హంతకుడు -

ఆరాత్రి నిద్ర పోలేకపోయాడు ప్రకాశం. అడుగడుగునా భూతాలూ ప్రేతాలూ కలలోకి వస్తున్నై ... నిమిష నిముషానికీ జెయిల్లో తన చుట్టూ తయారౌతున్నాయ్... తాను హంతకుడు......

* * *

తెల్లవారింది. సూర్యుడుదయించాడు - నిన్నట్లా తలదాచుకోకుండా.

ప్రకాశం కిటికీలోనించి చూశాడు... తెల్లవారింది ... అప్పన్న రాలేదేం? - బహుశా వాడికింకా తెలివి వొచ్చిఉండదు.

తొందరగా బట్టలు వేసుకుని హాస్పిటల్‌కి నడిచాడు ప్రకాశం ... తొందరగా వెళ్ళి సీసాలలోని పౌడర్లు యథాస్థానాలలో పెట్టకపోతే ప్రమాదం.

గేటుతీసుకుని, చప్పుడు కాకుండా డిస్పెన్సరీలోకి వచ్చి, త్వరగా తన పని ముగించుకుని, తనగదిలోకి వచ్చి కూర్చున్నాడు. కలలో బ్రతుకుతోన్నట్లుందతని పరిస్థితి.

"డాక్టర్!"

నీరసంగాలా వినిపించింది ... అవును. శేఖర్ గొంతుకే. అరే! శేఖర్ ఇంకా...

"గుడ్‌మార్నింగ్ డాక్టర్!"

"మార్నింగ్ ... శేఖర్!"

"అరే! అలా చూస్తారేం! ... నాకు చాలా కులాసాగా ఉంది. డాక్టర్!... ఈ పూట — అరే. రేఖా! అలా తెల్ల బోతావేం?"

రేఖ నీరసంగా కుర్చీలో కూర్చున్నది. డాక్టర్ ఆమెకళ్లల్లోకి చూశాడు. ముఖం అంతా అలా పాలిపోయిందేం? ... తన రహస్యం...

"చాలా బాగా ట్రీట్ చేశారు డాక్టర్! ...థాంక్స్ నర్స్... నేను వెళ్లి ప్రయాణానికి సిద్ధపడతాను. అవును. ఈరోజే వెళ్లిపోవాలి. నాకోసం అందరూ ఎదురుచూస్తూంటారు...ఒక్కమాట మీతో చెప్పాలి నర్స్...సెలవు డాక్టర్! మీ ఉపకారం మరువను...

శేఖర్ నెమ్మదిగా బయటికినడిచాడు... నర్స్ అతని వెనకాలే వెళ్లింది..."క్షమించు నర్స్!...నీత్యాగం ఇలాగే ప్రాణాలని కాపాడుతూ ఉండాలి. వంటఇల్లూ, పడకగదీ నీవికావు...నా ఉద్దేశాలు మార్చుకుంటున్నాను... సెలవు సిస్టర్!" బాధగా, ఆమెకళ్లలోకి చూస్తూ అన్నాడు. ఆమె తెల్లబోయింది.

అతను త్వరగానడిచి, సాగిపోయాడు. రేఖ ముఖంతిరిగినట్లు ఫీలై, చెట్టుకి జేరపడింది...తాను చేసిన 'త్యాగం'!...సిస్టర్!

"అలా ఉన్నారేం?...ప్రకాశం... సాను నయంగా అన్నాడు.

"కొంచెం-చికాకుగా ఉందిలెండి ... అంతే..."

"అవసరమైతే..."

"ఆ...ఇంటికి వెళ్తాను..."

"శేఖర్ ... రికవరీ చాలా చిత్రంగా ఉందికదూ?"

"చాలా చిత్రంగానే ఉంది...మీరు..."

"ఆఁ...అలానే అనుకున్నాను. కాని, వివరం (*Explain*) చెయ్యలేని విచిత్రాలు జరుగుతూనే ఉంటై!"

"నిజం డాక్టర్! విచిత్రాలు జరుగుతూనే ఉంటై!"

ఆమె వెళ్లిపోయింది-ప్యూర్ పాయిజన్ ఎలా ఫెయిలైందని ఆలోచిస్తూ; డాక్టర్ కుర్చీలో కూలబడ్డాడు- ప్యూర్ పాయిజన్ ఎలా ఫెయిలైందని ఆశ్చర్యపడుతూ.

★

## ★ కాలక్షేపం ★

(5 వ పేజీ తరువాయి)

యజ్ఞం ముగిసిన తర్వాత వెంట వెంటనే వానలు కురిశాయి. ఆయన పంట కూడా పండింది. చక్కని డాబాయిల్లు కట్టుకొని, దానిమీద మూడు గదుల మేడకట్టి ఆయనా, ఆయనభార్యాహాయిగా ఊగుటుయ్యాలలో ఊగుతున్నారు. యజ్ఞంచేసిన రామజోగి సోమయాజికి అంతకంటె ఏం కావాలి దేవేంద్రభోగం? ఇదివరకు పావలా కు, అర్ధరూపాయకూ, నిజదారసుతోదరపోషణార్థమై యాచించవలసివచ్చింది. కాని ఆయన ఆకలితీరవలెనంటే, ఆకు అలము తిని అరణ్యంలో హాయిగా తపస్సు చేసికొనలేకపోయినాడా! "నిఙాంగన దుర్దశ చూడలేని...దేహీయం చదుగ నేర్చునె కాలిన పొట్ట కెవ్వడున్?"

ఈయజ్ఞం (ఇష్టి) చేసినతర్వాత ఆయన ముష్టికై చేయి చాచవలసిన అగత్యం పోయింది. అంతేకాదు. ఆయనను అందరూ గౌరవిస్తూవున్నారు. అందరూ పూజిస్తున్నారు. ఒక్క చిన్నవిషయం చూడవచ్చు. ఆయనకు పొడుం పీల్చే అలవాటు ఎక్కువ. కాని, కానీ ఖర్చుచేసి నస్యం ఎన్నడూ కొని ఎరుగడు. ఎప్పుడూ నస్యానికి చెయ్యిచాచి నలుగురిలోనూ ఆయన అతిచుల్కన అవుతూ ఉండేవాడు. ఆయనని "ముష్టి ముక్కు, ముష్టి ముక్కు" అనే వారు. కాని, కాలం మారింది. ఇప్పుడు ఈ యిష్టి చేసినతర్వాత ఆయనకు కమ్మని పొడుం నింపిన పొడుంబుర్ర సిద్ధంగా ఉంచే శిష్యులు ఊరినిండా తయారైనారు. ఆయన చేసింది గొప్ప ఇష్టి, ఆయన ముక్కు కూడా ఇష్టిముక్కు అన్నారు. అది ముష్టి ముక్కు అనే అగౌరవం పోయింది. పొడుం పీల్చకపోతే ముక్కు ఎండిపోయినట్లుగా ఉంటుంది. కాని దేహీ అనివస్యం వినరమానవుణ్ణి ఆయన యాచించడంలేదు.

"దేహీయం చదుగ నేర్చునె
ఎండిన ముక్కు కెవ్వడున్?"

అనేది రామజోగిసోమయాజిగారి భీష్మప్రతిజ్ఞ.

దాసు వామనరావు.

# ★ కాళరాత్రి ★

(19-వ పేజీ తరువాయి)

రాజా తండ్రిఫోటో దగ్గరకు వెళ్లి చూస్తూ నిలబడతాడు. 'అవును నాన్నా ఇక్కడేం జరిగినా జరగవచ్చు' అన్నట్టు తల వూపుతాడు. నళిని వరండాతలుపు తెరుచుకుని ద్వారంలోనే నిలబడుతుంది రాజాకేసి చూస్తూ. ఎవరో వచ్చినట్లు గదిలోకి రాజా గ్రహిస్తాడు.]

రాజా : (ఇటు తిరగకుండానే) రా... నీ కోసమే ఎదురుచూస్తున్నాను కూడా (గిరుక్కున ఇటుతిరిగి నళినినిచూసి) ఓ—నువ్వా!

నళిని : ఐతే హంతకుడు హత్యారంగాన్ని మళ్లీ ఓసారి తొక్కందే వూరుకోడంటారు కదూ—అందుకనిచూస్తూన్నాను, కాని—ఇంత తొందరగా రాడే మోలే!

నళిని: ఐతే హంతకుడెవరో తెలుసా?... ఎవరు?

రాజా : నాకు తెలుసా ? హుం... నాకే కనక తెలిస్తేనా—!

నళిని : మరి తెలుసుకుతీరాలి రాజా!

[వెంకన్న ట్రేలో నాలుగు కప్పుల్లో ఒక ఫ్లాస్కుతో వస్తాడు]

వెంకన్న : టీ తెచ్చాను బాబూ.

రాజా : అలావుంచు... చాలు - నువ్వెళ్లి పడుకోవచ్చు.

వెంక : బాబూ మరి - సర్దటంసంగతి?

రాజా : సర్దటమా?

వెంక : అదేబాబూ—గుడ్డలూ అవీ—

రాజా : ఓ—రేపు పొద్దున చూచుకో వచ్చులే అది.

వెంక : కాదు బాబూ—

రాజా : ఏముంది వెంకన్నా — ఏదో కొత్త ఘరానాకైదీ ధరించడానికి చాలును.

నళిని : (ఉలిక్కిపడి) ఓహ్—

వెంక : (విచారంతో) సరే బాబూ (వెళ్తాడు).

(నళిని ఎగదన్నుకొస్తూన్న దుఃఖాన్ని ఆపుకోలేక పోతుంది)

రాజా : నళినీ!

నళిని : హత్య!... హత్యాపరాధం చేశావా నువ్వు?—ఓహ్—

రాజా : నువ్వేం కలవరపడకు నళినీ. అంతా సవ్యంగానే జరుగుతుంది. నాకేం భరవాలేదు. హంతకుడు తప్పనిసరిగా పట్టుబడతాడు. రామానుజంగారి నవలల్లోలాగా [వెటకారంగా తెచ్చిపెట్టుకుని నవ్వుతాడు].

[వరండాలోంచి మోహన్ వస్తాడు ఆదుర్దాతో విచారంగా].

రాజా : ఏం మోహన్?

మో : పొద్దున్నే ఓ పల్లెవాణ్ణి తెప్పమీదైనా సరే పట్నంపంపిస్తానంటున్నాడు రామానుజం!

రాజా : ఊఁ — పంపించనీ. నా కూ పోలీసుల్ని చూడాలనే ఉంది సాధ్యమైనంత త్వరగానే.

మో : నీగ్గాని మతి పోతోందా?

రాజా : నేను నారాయణ్ణి చంపలేదు.

మో : అవున్నాకు తెలుసు. కానీ — పోలీసులచేత నమ్మించు ఆ విషయం.

రాజా : నీక్కూడా పూర్తిగా నమ్మకం లేదు కదూ?

మో : (మాట్లాడడు).

రాజా : నేనా పని చెయ్యలేదు మోహన్ నమ్ము.

మో: నా నమ్మకమెవరిక్కావాలోయ్. న్యాయస్థానాన్ని మనమిప్పుడు నమ్మించాల్సింది!... నువ్వు కాకపోతే నరహరిగానీ, రామానుజంగానీ అయివుండాలి. నేను కాదని నాకు తెలుసుగదా!... నాకు మటుకు రామానుజం మీదనే అనుమానం!

నళిని : (అకస్మాత్తుగా ఏదోతట్టి, అవునూ—రివాల్వరు పేలంగానే గదిలోకి వచ్చింది రామానుజమూ నరహరీ అనికదూ అన్నారు?

రాజా : వాళ్లకంటే ముందేవచ్చాను నేను.

నళిని : వాళ్లెటునుంచి వచ్చారు?

రాజా : డ్రాయింగ్ రూంలోంచి ఎందుకూ?

నళిని : ఆ గదితలుపు లీ పక్కనే గడియ వేసివున్నాయా?

రాజా : అవును. వాళ్లు తట్టంగానే నేనే వెళ్లి గడియతీశాను.

నళి : మరి మిగతా తలుపులుకూడా వేసివున్నాయో లేదో నువ్వు చూశావా?

రాజా : లేదు.

నళిని : పోనీ వాళ్లిద్దర్లో ఎవరైనా ఆ విషయం ఎత్తారా?

రాజా : ఆ నాకైతే ఆ మాట తోచలేదు గాని—వాళ్ళన్నారు.

నళిని : ఎవరు? ఎవరన్నారు వాళ్లిద్దర్లో?

రాజా : ఏమో— ఎవరన్నారో...... ఆఁ! నరహరి!

నళిని : (ముఖం వికసించి) నరహరి! ఆఁ—అంతే! తలుపులన్నీ ఇటుపక్క గడియలు వేసేవున్నాయని అతనికి తెలిసేవుండాలి. లేకపోతే అలా ఎందుకంటాడు?

మో : నా కర్థంకావడంలేదు.

నళిని : అర్థంకాకపోవడానికేముంది? ఆ తలుపులు వేసిపోయిందికూడా నరహరే నన్నమాట! అందుకనే ఏ తలుపులు వేసివున్నాయో ఏవి వేసిలేవో అతనికి తెలుసు. రామానుజమూ తనూ లోపలికి రాగానే అమాయకుడైన రాజా రామానుజం కంగారుపడుతూంటేగా ఒక వాకిలి గడియవేసేసివుంటాడు!

రాజా : అంటే నారాయణ్ణి హత్యచేసిన తర్వాత పారిపోయిన వాకిలా?

నళిని : అవును.

మో : అది—

నళిని : అది భోజనాలగది వాకిలే అయివుంటుంది.

మో : అవునుమరి. వీధిలోకి పారిపోయివుండడు. పడమటింటి తలుపు గడియ నువ్వే తీశావుగదా! ఇక మిగిలింది భోజనాలగది గుమ్మమే.

నళిని : తను ఆ గడియ వేశాక రామానుజాన్ని వేసివుందో లేదో చూడమంటాడు. తను చూసేసరికి వేసేవుంది గనక ఆ బోళా శంకరుడు అలా అని కోర్టులో ప్రమాణం చెయ్యడానిక్కూడా సిద్ధమే.

మో : అవును! నరహరే కనక హంతకుడైతే—

నళిని : ఐతే ఏమిటి? అతను కాకపోతే ఇంకెవరైనా కావడానికి సావకాశం ఏదీ? కవి పెట్టారా మనిషి. తరహాకూడా—వెనక నిలబడి జరిగేదంతా చూస్తూ నుంచోవడమూ అదీ?

మో : అవును నారాయణ్ణి చంపడానికి తగిన బలవత్తర కారణంకూడావుంది వాడికి కదూ రాజారావ్?

రాజా : (నళిని వంకతిరిగి) కమలకూడా మేం భోజనాలకెళ్ళినప్పుడు ఆమె, నారాయణ ఇక్కడ వుండగా ఏదో జరిగిందని చెప్పింది. ఆమె హడలిపోయి ఎవరో వెంటబడి తరుముతున్నట్లు కనిపించింది.

మో : వాళ్ళిద్దరూ ఇక్కడుండగా నరహరి చూచాడేమో!

నళిని : అంతకంటే ఇంకేం కావాలి నరహరి ఉద్రేకాన్ని రెచ్చగొట్టడానికి?

రాజా : అవునుగాని... వాడికి పరకే ప్రేమలేఖ వ్రాయడమా? ఏమోనబ్బా—నే నమ్మలేనిది.

మో : నమ్మిమటుకు మనమేం చెయ్యగలం? ఈఘోరం అతనే చేశాడని సాక్ష్యం ఏమిటి?

రాజా : అవును. అనుమానించినంత మాత్రాన సరిపోతుందా?

నళిని : అతని పాపం బయటపెట్టే ఆధారం ఏదో వొకటి వుండితీరాలి.

రాజా : ఈ కేసులో మటుకు లేదు.

మో : లేకపోతే వాణ్ణి చావగొట్టి చెవులు మూసి నిజం చెప్పిద్దాం.

రాజా : నరహరి అలా ఎప్పుడూ బయట పడడు. నామీద సాక్ష్యం చాలా బలంగా వుందని అతనికి తెలుసు.

నళిని : ఎంత బలంగా వున్నా ఏదో లోపం వుండాలి—ఎక్కడో అక్కడ వుండి తీరాలి!

రాజా : ఉన్నా—అదేదో మనంకనుక్కో గలమా? అనుక్షణం అతి జాగ్రత్తతో వుంటాడు.

మో : నే వెళ్ళి నరహరిని కనిపెడుతూ వుంటాను. ఎందుకైనా మంచిది.

[వరండాలోకి వెళ్తాడు కొంత నిశ్శబ్దం]

నళిని : ఏం రాజా—ఎంతసేపు ఈ నిరీక్షణ? దేనికోసం? చేసితీరాలి ఎదో వొకటి మనం—(గబుక్కున) ష్!—

[చాలా నెమ్మదిగా మూలుగొకటి వినిపిస్తుంది. ఇద్దరూ అదిరి పడతారు. నళిని పడమటింటి వైపు నిర్దేశిస్తుంది. మూలుగు ఏడుపుగా మారి అకస్మాత్తుగా ఆగిపోతుంది. నళిని గబగబా వెళ్ళి తలుపు బార్లగా తెరుస్తుంది. ఒక్క క్షణం అవకాశం... నళిని చెయ్యి పట్టుకుని తీసుకు వస్తూండగా కమల చాలా బలహీనంగా వస్తుంది. నళిని తలుపుగడియవేసి, కమలను సోఫాదగ్గరకు తీసుకువెళ్తుంది.]

నళిని : కూర్చోండి.

కమల : నే కూర్చోనిక్కడ.

[లేచి వెళ్ళబోతుంది. నళిని ఆమె నడ్డగిస్తుంది.]

నే వెళ్ళిపోవాలి— వెళ్ళనివ్వండి దయచేసి—

[కళ్ళనీళ్లు కొనగోరుతో మీటి దెబ్బతిన్నట్టు నళినివంక చూస్తుంది.]

నళిని : ఇప్పుడో చిన్న విషయం మాట్లాడాలి మీతో.

కమల : మీతో ఏమీ మాట్లాడదలచుకో లేదు నేను.

నళిని : మీరు మనసు మార్చుకుంటే బాగుంటుంది.

కమల : (ప్రార్థిస్తూ) రాజారావుగారూ!

నళిని : రాజారావుగారికి ఇందులో సంబంధం ఏమీలేదు. ఇది మన యిద్దరి మధ్యామాత్రమే...కూర్చోండి.

[కమల లొంగిపోయి సోఫాలో కూర్చుంటుంది కొంగుతో కళ్లు ఒత్తుకుంటూ.]

రాజా : నళినీ! ఎందుకలా శ్రమపెడతావ్ ఆమెని? అసలే చాలా తల్లక్రిందులై పోయినట్లుంది.

నళిని : నేనూ అలాగే వున్నాను... కమలాదేవితో ఏకాంతంకావాలి నాకు... కాస్సేపు నువ్వవతలకు వెళ్లడంమంచిది.

కమల : వద్దు—వెళ్లొద్దు—

నళిని : రాజా!

రాజా : (కమలవంక జాలిగా చూసి) కాదు నళినీ—

నళిని : నేనావిడ కేవిధమైన బాధా కలిగించను. నామీదఆమాత్రం విశ్వాసం లేదూ? ఈ ఒక్కసారికిమాత్రం నన్ను నమ్ము. నువ్విప్పుడు వినగూడని రహస్యాలు కొన్ని కమలాదేవితో మాట్లాడాలి నేను.

[రాజావరండాలోకి వెళ్ళిపోతాడు.

కమలలేచి అటే వెళ్లబోతే నళిని అడ్డం వచ్చి ఆ తలుపు గడియ వేస్తుంది. కమలకు ఏడుపు పెడబొబ్బల పర్యంతం అవుతుంది—]

వొద్దు. ఏడుపులూ కేకలువెయ్యడం ఏమంత మంచిపనికాదు—దానివల్ల ఉపయోగమూ లేదు. మీ రెంత ఏడ్చినా వాళ్లెవరూ రాలేరు. తలుపులన్నీ గడియలు వేశాను. ఇక రెండోది—మీ రాగదిలో చచ్చిపోయిన నారాయణమీద పడి ఎందుకేడుస్తున్నారో వాళ్లందరికీ కూడా చెప్పాల్సివస్తుంది.

[కమల తిరిగి వెళ్లి ముఖం చేతుల్తో కప్పుకుని సోఫాలో కూలబడుతుంది. నళినిదగ్గరకువచ్చి ఆమెవంకచూస్తుంది. ఈసారి మాట్లాడినప్పుడు ఆమె కంఠం జాలితో ఆర్ద్రమైవుంటుంది—]

అతను మీ బావకదూ?

[కమల ఏడుస్తుంది]

నేనే అయితే, ఇంత ఘోరాని కొడిగట్టిన వాణ్ని అలా వదిలేసి ఊరుకోను.

కమల : రాజారావు గారేగా ఇంతపని చేసింది!

నళిని : ఊరికే అంటున్నారుగాని ఆ హత్యచేసింది రాజా అని మీకే నమ్మకం లేదు...కదూ? ఉంటే ఇప్పటికే నాకువ్యతిరేకంగా అతన్ని ప్రోత్సాహపడే వుండరు. అతని మంచితనంమీద ఆమాత్రం నమ్మకము వుందికనుకనే భోజనాలకు ముందు మీరు మీ బావా ఇక్కడ వుండగా జరిగిన విషయం అతనికి చెప్పారు—

కమల : ఏం చెప్పాను? ఏం జరిగిందని?—

నళిని : ఏం జరగలేదూ?

కమల : ఏమీ జరగలేదు ... ఏమో నాకేం గుర్తులేదు.

నళిని : మీరూ నారాయణ ఇక్కడ వుండగా మిమ్మల్నొకరు మాశారు!... కదూ?... చెప్పండి—

కమల : ఏమో నాకు తెలీదు.

నళిని : ఇందాక ఆ వుత్తరాల సంగతి అడిగినప్పుడైనా కూడా ఇలాగే బాధపడి సరిగా సమాధానం చెప్పకుండా వెళ్ళిపోయారు మీరు!...

కమల : చెప్పానుగా అందరికీ వచ్చాయని.

నళిని : నాక్కావలసింది పరశాదేవి ఉత్తరం గురించే. ఆమె ఎవరికి వ్రాసిందో మీకు తెలుసు.....రాజారావుకు కాదని తెలుసు...అసలు సంగతేమిటో కూడా మీకు తెలుసు—తెలుసు కదూ?

[కమల మాట్లాడదు]

అది మీ భర్తకి — నరహరికి వ్రాసింది కదూ?

కమల : (ఏడుస్తూ) కాదు—కాదు—

[ఎవరో వరండా తలుపు తట్టిమాస్తారు—నళిని వినిపించుకోదు—]

నళిని : మరెవరికి వ్రాసింది?...

చెప్పండి—

రోడ్డు ప్రక్కగా గ్రుడ్డివాడొకడు కూర్చొని వున్నాడు. జేబులోనుంచి ఒక కాణీ తీసి వాడిముందు పరిచి వున్న గుడ్డమీదికి విసిరాను. అదిచాలాందూరం దొర్లుకొంటూపోయింది. గుడ్డివాడు గబగబాలేచి పరుగెత్తుకొంటూ పోయి దాన్ని తీసుకొస్తున్నాడు. నాకు ఆశ్చర్యమూ వేసింది: నవ్వూ వచ్చింది.

“మరి నువ్వు గుడ్డివాడివి కదా?” అన్నాను.

“లేదు బాబూ! నేను అసలు మామూలు గుడ్డివాణ్ణి కాదు. ఇక్కడ మామూలుగా కూర్చునే గుడ్డివాడు యివ్వాళ సినిమాకి వెళ్లాడు. నేను వాడి తరఫున కూర్చొన్నాను. అంతే!” అన్నాడు వాడూ, నవ్వుతూ.

—శ్రీనివాసన్, చెన్నాపు.

## ★ కాళరాత్రి ★

[వరండా తలుపు బాగా కుదుపుతారెవరో—]

కమల: ఏం చెప్పమంటారు? నాకేం తెలీదు

నళిని: హత్య చేసింది రాజా మాత్రం కాదని మీకు తెలుసు—సరళ ఆ వుత్తరం వ్రాసింది రాజారావుకు కాదని తెలుసు... తెలుసు కదూ?

కమల: (బాగా ఏడుస్తూ) ఓహ్—నాకేమీ తెలీదు—నన్నెందుకిలా బాధ పెడ్తారు?

నళిని: మీ బావ మీరూ ఇక్కడ ఏకాంతంగా వుండగా చూసిందెవరో కూడా మీకు తెలుసు!...ఆ చూసింది మీ భర్త నరహరి కదూ?

కమల: ఏమో — కాదు — నాకేం తెలీదు. వదిలెయ్యండీ నన్ను దయచేసి.

నళిని: నారాయణ అంటే అసహ్యించుకుని ద్వేషించే వాళ్లు—మీ బావా మీరూ ఇక్కడ వుండగా చూచి సహించలేక పోయిన వాళ్ళు అతన్ని హత్యచేశారు!... రాజామాత్రం కాదు...సరళ ఎవరికైతే ఆ వుత్తరం వ్రాసిందో వాళ్లూ ఆ ఘోరం చేసింది!—

[తలుపు మళ్లీ చప్పుడవుతుంది గబగబ. కాని నళిని వినిపించుకోదు—]

వాళ్లెవరో మీకు తెలుసు!...మిమ్మల్నిక్కడ చూసిందెవరో మీకు తెలుసు!...ఈ వుత్తరం ఎవరికి వచ్చిందో మీకు తెలుసు! ...మీరు నాకు చెప్పితీరాలి—

[మళ్లీ తలుపుచప్పుడు]

కమల: నన్ను— నన్ను హింసపెట్టకండీ—

నళిని: ఎవరు— ఎవరు నారాయణ్ణి హత్యచేసింది?

కమల: నాకు తెలీదు.

నళిని: ఎవరికొచ్చిందా వుత్తరం?

కమల: నాకు తెలీదు.

నళిని: మీకు తెలుసు—చెప్పితీరాలి... చెప్పండి—

[ఒక్కతోపుకు గడియవిరిగి వరండా తలుపు గభాలున తెరుచుకుంటుంది. కమల కెవ్వుమంటుంది. నళిని వెనక్కి తగ్గుతుంది.

[నెమ్మదిగా నరహరి వస్తాడు లోపలికి]

(ఇంకా వుంది)

## ★ దీర్ఘాయువు ★

(43-వ పేజీ తరువాయి)

చంపారు. ఆ చచ్చిపోయే ముందు నా తండ్రికి ఇట్టి ఆలోచన వచ్చింది. "ఈ బ్రహ్మదత్తుడు నన్ను చంపుతున్నాడు. నా కుమారుడైన దీర్ఘాయువు వైరాన్ని పెట్టుకొని ఇతణ్ణి చంపుతాడు. అది ఎవరికి శ్రేయం కాదు." అని. అట్టి ఆలోచనవచ్చి, మీ హితాన్ని మదిలో ఆలోచించి, అట్టి సలహా ఇచ్చారు. ఈసలహాలో నాకు మేలుకోరుతున్నది కూడా వుంది. మిమ్మల్ని వైరం పెట్టుకొని నేను చంపేశాననుకోండి నన్ను మీభటులు చంపేస్తారు. మనం ఇట్లా చచ్చిపోవడమే జరుగుతున్నది గాని వైరం ఎక్కడ అంతం అవుతున్నది? అందుచేత వైరంచేత వైరం అంతం కాదని తేలుతున్నది. ఇప్పుడు ఏమి జరిగింది? మీరు నా చేతిలో చిక్కారు. నేను మీకు ప్రాణభిక్ష పెట్టాను. ఇక్కడ ఇప్పుడు ఈసభలో అంతా నేను ఎవరినో తెలిసి నన్ను చంపేస్తామంటూ లేచారు. మీరు వారిని ఆపి, నాకు ప్రాణదానం చేశారు. అవైరమార్గాన్ని నేను అనుసరించాను. మీలో వైరం శాంతించింది. అంటే అవైరంచేతనే వైరం శాంతిస్తుందని తేలింది. ఇదంతా గ్రహించే నాతండ్రియైన దిఘితి రాజు చనిపోయేముందు "తాత! దీర్ఘాయువు! అవైరంచేతనే వైరం శాంతిస్తుంది" అని బోధించారు.

దీర్ఘాయువు ఈ ఉపన్యాసాన్ని వింటూవున్న రాజుముఖంలో ఆశ్చర్యతరంగాలు ఆనందతరంగాలు తోస్తూ వచ్చాయి. దీర్ఘాయువు ఇట్లా అని తన స్థానంలో తాను కూర్చున్నాడు. బ్రహ్మదత్తుడు గబగబా దీర్ఘాయువు దగ్గరకు వచ్చి, గ్రుచ్చి కౌగలించుకున్నాడు. ఎత్తుకొని ముద్దు పెట్టుకున్నాడు. ఆశ్చర్యం! అద్భుతం! తాత! దీర్ఘాయువు! నీవు ఇంతటి పండితుడవా? ఇంత తెలిసినవాడవా? మీతండ్రి అంత క్లుప్తంగా అన్నమాటల్లో ఇంత అర్థం ఇమిడి వున్నదా? ఎంత బాగా విస్తరించి ధర్మబోధ చేశావు! నీరాజ్యం నీకు ఇస్తున్నా. నీసైన్యం నీకు ఇస్తున్నా! నీకోశం నీకు ఇస్తున్నా. నీ కోష్ఠాగారం నీకు ఇస్తున్నా నీవాహనాలు నీకు ఇస్తున్నా. నాకు ఒక్కకోర్కె వుంది. తీరుస్తావా! దీర్ఘాయువు!!"

"సెలవు ఇప్పించండి, మహారాజా!"

"నాకు ఒక్క గాని ఒక్క కూతురు వుం. ఆమెను కూడా నీకు ఈ రాజ్యంతో సహా దానం చేస్తాను. గ్రహిస్తావా! నాయనా!"

సభలో అందరు జయ జయధ్వానాలు చేశారు. అందరు ఆనందం పొందారు. దీర్ఘాయువు మధుర లజ్జను పొందాడు. రాజు దివ్యమైన ఆనందాన్ని పొందాడు.

పురోహితులు శుభముహూర్తం నిశ్చయించారు. ఆ శుభముహూర్తంలో కాశీరాజు బ్రహ్మదత్తుడు తన కూతురిని, తన రాజ్యాన్ని కూడా కోసలరాజైన దీర్ఘాయువుకు దానంచేసి వేశాడు. దీర్ఘాయువు దంపతులు దీర్ఘాయువులై పృథ్విని దీర్ఘకాలం దివ్యంగా, దివ్యధర్మంగా పాలించారు.

★

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu ChettySt, Madras.